# సోవియట్ దేశం

సంస్కృతి గ్రంథమండలి

పెరంబూరు పోస్టు :: :: మద్రాసు

## ఇందులో—

1

PSL01EH06

# సోవియట్లదేశం

## (రెండవ భాగం)

అనువాదం :

శశి

సంస్కృతి గ్రంథమండలి

వంగల్ బిల్డింగ్స్, :: :: పెరంబూరు పోస్టు,

మద్రాసు.

ప్రచురణ—10

ప్రథమ ముద్రణం.

వెల పది అణాలు.

జనవరి 1944.

సంపాదకులు :

కస్తూరి సూర్యప్రకాశరావు,

కొత్తపల్లి సుబ్బరామయ్య,

మేనేజరు :

వంగల్ గోవిందస్వామి రెడ్డి

3

# మా మాట

మా గ్రంథమండలి ప్రథమ ప్రచురణ "సోవియట్లదేశం." దాని "రెండవభాగం" ఈ ప్రచురణ. అనువాదకులు శ్రీ శశిగారు మొదటి భాగాన్ని మేము ప్రచురించిన కొద్ది మాసాల్లోనే రెండవ భాగాన్ని మాకు అందచేశారు. కాని కాగితం దొరకనందున వెంటనే ప్రచురింపలేక పోయాము. ఇంచు మించు రెండు సంవత్సరాల పిదప రెండవభాగాన్ని అందించినందుకు పాఠకలోకం మమ్ము మన్నించునని నమ్మిక.

పెరంబూరు
31—12—43

సంపాదకులు.

# 1. కళలు – వాఙ్మయము

## (చిత్రసెన్)

సోవియట్ జీవిత సిద్ధాంతాన్ని పెట్టుబడిదారీ ప్రపంచము నిరాకరించు చున్నది. అందువలననే సోవియట్ల దేశంలో కళలు సజీవములయి ఉండడానికి అవకాశం లేదని పెట్టుబడిదారీ ప్రపంచమంటున్నది. కళాసృష్టికి తగిన ఉత్సాహా న్నిచ్చే ప్రేరకాలు సోవియట్ యూనియనులో లేవని పెట్టుబడిదారుల నమ్మిక. వర్గాలు లేని సమాజంలో కళలెలా ఉంటవి ? అని వారి అనుమానం. సోవియట్ల దేశంలో - వారి అదృష్టవశాత్తు - తమ చిత్రాలను చౌకగా చిత్రింపించి తమ మిత్రు లకు సాయంవేళల చూపించే మహారాణులు, జమీందారిణులు, చౌదరమ్మలు, సోమిదేవమ్మలు లేరు. తాను ఏ యుద్ధసమయంలోనో వ్యాపారం సాగించి, ప్రజ లను కొల్లగొట్టి, దోచిన కోట్ల రూపాయలలో ఏ కొద్దివేల రూపాయలతోనో తన కంటే హెచ్చు మోసగాడైన తన తండ్రిపేరనో, లేక అవి నీతిపరురాలైన తన తల్లి పేరనో ఒక్క గ్రంథాలయాన్నో, ఒక పఠన మందిరాన్నో కట్టించి, చాలని కొదవకు కూటికి లేక తనచుట్టూ పదిసార్లు తిరిగిన చిత్రకారునితో బెగబేరమాడి, చౌకగా తన చిత్రాన్ని చిత్రింపించి తాను పాపపు సొమ్ముతో కట్టించిన ప్రజోప యోగ భవనంలో దానిని తగిలించుటకు బహూకరించే మహనీయులు లేరు. పూర్వీ కులు అన్యాయంగా సంపాదించిన డబ్బుతో తాను, తన భార్య - ఇర్వురుమాత్రమే ఉండడానికి ఏడంతస్తుల మేడలుగట్టించే ఏబ్రాసులు లేరు. ఒక చిత్రాన్ని, ఒక పటాన్ని క్రిందా పైనాచూచి, బాగున్నది, బాగుగాలేదు అని తీరికగా, స్తిమితంగా నాల్గు ఘంటలకాలం చర్చించడానికి తగిన "విశ్రాంతిగల వర్గం" సోవియట్ల దేశంలో, లేదు.

కాని, ఆ దేశంలోని కళలు స్థిరమైన పునాదులమీద స్థాపింపబడియున్నవి. ఉత్పత్తికి అవసరమైన ఊహలను వన్నిన ఉత్సాహమే నేడు కళలనుగూడా సృష్టించుచున్నది.

## భవన నిర్మాణం

శ్రామిక వర్గంలో చైతన్య ముదయించినది గనుక నూతన భవన నిర్మాణకళ పుట్టినట్లే.

కూటికి, రక్షణకు, సౌఖ్యానికి కావలసిన సదుపాయాలను ప్రజలకు సమకూర్చుటకు దేశమందంతటను ఫాక్టరీలు లేచినవి. ప్రతి ఫాక్టరీ గొట్టంమీదను, ప్రతి కర్మాగారంమీదను నిర్మాతల ప్రేమపూరితమైన శ్రద్ధ ప్రతిబింబించుచున్నది. అందువలననే ఆ ఫాక్టరీల గొట్టాలు నిటారుగా, వంకరలేకుండా, అందముగా నిల్వబడియున్నవి. గంభీరమైన నగళ్లను, గొప్ప గొప్ప వంట ఇండ్లను, విశాలమైన భోజన శాలలను సోవియట్ నిర్మాతలు నిర్మించారు. విశ్రాంతిశాలలు, సంస్కృతి భవనాలు, నాటక శాలలు, సినిమా హాలులు మొదలైన కట్టడాలన్నిటిని గంభీరముగాను, సొంపుగాను, సుందరముగాను ఉండేట్లు నిర్మించారు. ధనిక వర్గపు చేతుల్లోనుంచి, డబ్బు పెత్తనంనుంచి తప్పి భవన నిర్మాణశక్తి త్వరలోనే విశాలతను, గాంభీర్యమును పొందగల్గింది. పెట్టుబడిదారీ ప్రపంచంలో భవననిర్మాణ శక్తి కంట్రాక్టర్ల పైపోటీలకిందబడి నలిగిపోవుచున్నది. కోట్ల డబ్బుగల వెంకయ్య గారు తన కొత్త ఇల్లు కట్టడానికి పేరు, ప్రఖ్యాతివహించిన కంట్రాక్టరు గనుకను, తన కులానికి చెందినవాడు గనుకను పుల్లయ్యకే కంట్రాక్టు యిస్తాడు. పుల్లయ్య చూపు అన్నివిధాలా లాభంమీదే ఉంటుందిగాని ఆ భవన నిర్మాణంలోని అంధం, ఆకారం, విశాలత, గంభీరత, ఔన్నత్యం మొదలైన భవన నిర్మాణ కౌశలానికి వలసిన సుస్వభావాలమీద ఉండదు. ఏ విధముగానైనను, ఎన్ని మోసాలుచేసియైననునరే తనకు సంక్రమించనున్న లాభాన్ని వీలైనంత హెచ్చుగా చేయుటకే ఇతడు ప్రయత్నిస్తాడు. అంతేగాని మరి వేరుదృష్టి లేదితనికి. పైగా, తన కింత లాభం వచ్చిందని వెంకయ్యగారికీ, కూలీలకూ తెలియకుండా ఉండడానికిని, రాబడి పన్ను వసూలుచేసే ప్రభుత్వోద్యోగులకు నామం వేయడానికిని తప్పు లెఖ్కలు తయారు చేస్తాడు. మరో ధనికుడు, కామయ్యగారు, తన డబ్బు వడ్డీకిస్తే వడ్డీ, అసలూకూడా రావడంలేదు గనుక విసిగి పొలంకొంటాడు. కాని, మక్తాలు సరిగా రావు సరేగదా, వెల్లువలు, గండ్లుపడడం, అతివృష్టి, అనావృష్టి మొదలైన అగచాట్లు ఏర్పడినవి. ఇన్‌కమ్‌టాక్సు (రాబడిపన్ను) ఉద్యోగస్థులనైతే లంచాల

ద్వారానో, దొంగలెక్కలతోనో మోసగించవచ్చుగాని భూమి శిస్తును తప్పించుకో డానికి వీలు కనబడలేదు. తల బట్టగట్టి, మరికొంత డబ్బుతో బాడుగల కివ్వడానికి ఇండ్లు కట్టిస్తాడు. ఈ భవన నిర్మాణంలో అతని ఆశయం కేవలం ఎక్కువ బాడుగ రావడమే. బాడుగకువచ్చేవారి సౌకర్యాలతోగాని ఇండ్ల అందము, చందముతో గాని అతనికేపాటి నిమిత్తమూ లేదు. ఈవిధంగా, సుందరమైన భవనాల్లో, ఆరోగ్యవంతమైన పరిసరాల్లో, ఆనందంగా నివసింప నిచ్చగించిన మానవుల కోర్కెల కన్నివిధాలా అటంకము లేర్పడుచునే యున్నవి. మానవుని దురాశయే వీటన్నిటికిని కారణము. ఇటువంటి పెట్టుబడిదారీ పోకడ లన్నింటిని, అదృష్ట వశాత్తు, సోవియట్లు దాటగల్గినవి.

సోవియట్లలోని భవన నిర్మాత అనేక పోకడల నవలంబించుచున్నాడు — పూర్వపు రష్యా భవన నిర్మాణ విధానం; మధ్యయుగంలో ప్రాచ్యదేశాల్లోనున్న పోకడలు; ఆధునిక పాశ్చాత్య దేశాల ఫెర్రొకాంక్రీట్ (సిమెంటు) పోకడలును. పూర్వపు పోకడలను పునరుద్ధరించడం అతని ఉద్దేశంకాదు. పెట్టుబడిదారీ దేశా ల్లోని నిర్మాతకున్నట్లు పాత అలవాట్లను పూజించే జాడ్యం అతనికిలేదు. ఆధునిక పాశ్చాత్య పోకడలను, మనదేశంలోని నిర్మాతవలె, గుడ్డిగా అనుసరించడం అత నికి గిట్టదు. తననైపుణి ఆధునికమైనదని అనిపించుకొనవలయునన్న మూఢత్వము అతనికి లేదు. అందువలననే నేడు భారతదేశంలో కనబడు అనాకారమైన భవనాలు సోవియట్లలో కనబడవు. మనదేశంలో ఇప్పుడు ఇంగ్లాండులో విక్టోరియారాణి కాలంలోనున్న పోకడల ననుసరించి పెద్ద పెద్ద భవనాలు నిర్మించడం, వాటినెత్తిన మొగలాయి చక్రవర్తులకాలపు శిఖరాల నమర్చడం మొదలైన అనాకారపు నిర్మా ణాలను చూస్తుంటే వెగటువేస్తుంది. సోవియట్ రష్యాలో "ఉపయోగవాది" త్వర లోనే "నిర్మాత"కు లొంగిపోవలసి వచ్చింది. ఏ భవనంగాని అది ఎందుకొరకు (ఎవరి వసతికొరకు) నిర్మింపబడినదో ఆ అవసరాన్ని పూర్తిచేయుటే ముఖ్యం గాని, మిగత విషయాలు - కళాపోషణ, గంభీరత, ఆకృతి, సౌందర్యము మన కనవసరం అనేవారు "ఉపయోగవాదులు." వీరిదృష్టికి ఎవరైతే భవనాలను వాటివాటి పనులకు తగినట్లు నిర్మించెదరో వారే గొప్ప నిర్మాతలు. ఉదాహరణకు విద్యార్థుల వసతి గృహాన్ని తీసుకుందాం. ఇంతమంది విద్యార్థులుండడానికి, అని అనుకున్న గృహాన్ని అంతమంది విద్యార్థులుండడాని కనువుగా నిర్మించి, ప్రతి విద్యార్థికిని

వీలైనంత ఎక్కువగాలి, వెలుతురు దొరికేట్లు నిర్మించగలవాడు ఉత్తమ నిర్మాత యని వీరిభావం. కాని "నిర్మాత" ఇందుకు వ్యతిరేకాభిప్రాయం గల్గియున్నాడు. నిర్మాత ఉద్దేశంలో ప్రతి నిర్మాణానికిని కొన్ని న్యాయాలున్నవి. ప్రతి నిర్మాణమూ శాస్త్రయుక్తంగా ఉండవలెను. నిర్మాణశక్తి ఒక కళ. భవనాన్ని కట్టడంలోను ఉపయోగించే వస్తుసామగ్రిలోను, ముగింపులోను ఒక విధానం, ఒక పంథా ఉండవలయునని వీరివాదన. సోవియట్లలో మొదట కొద్దికాలం "ఉపయోగవాదు"ల మాట చెల్లింది. కాని వారు కట్టిన కట్టడాలు అందం, చందంలేకుండా ఉన్నందున త్వరలోనే "నిర్మాతలు" ముందుకొచ్చినారు.

సోవియట్లలోని నూతన నిర్మాణాలన్నిటిలోను వన్నెకెక్కిన ఉదాహరణ ఖార్కోవ్ నగరంలోని "హౌస్ ఆఫ్ ప్రాజక్ట్స్" అన్న భవనం. ఈ కట్టడపు స్తంభాలు సన్నగా, పొడవుగా అమర్చబడియున్నవి. పొడవు, వెడల్పులు ఎత్తుకు తగినట్లున్నవి. కట్టడము మధ్య అక్కడక్కడ ఖాళీ స్థలాలు - కావలసినంత గాలి రావడానికి - వదలబడియున్నవి. దీనికంటే ఎక్కువ గంభీరమైన భవనం సోచి నగరంలోని ఆరోగ్యశాల. ఈ కట్టడము చాలా పెద్దది. ఇందులో అనేక అంతస్తులున్నాయి. వేరు వేరు భాగాల్లో, వేరు వేరు అంతస్తులను, అనేకవిధాలుగా అమర్చినందున ఈ భవనం అతి సుందరంగా ఉన్నది. సన్నగా, పొడవుగా ఉండడం; పిదప వలయాకృతిని దాల్చడం మొదలైన మార్పులలోని నిర్మాణ కౌశలం; ఇలాంటి భవనాల్లో విద్యుద్దీపాల వెలుతురు శోభించే రీతి; మొదలైన కళాచమత్కారాలను చూడవలయునన్న మాస్కో నగరంలోని "భూగర్భ రైలుమార్గం" లోను. మాస్కో సివిల్ ఉద్యోగుల గృహముల్లోను చూడనగును.

నిర్మాణ నైపుణి, సామగ్రి, విధానం (రీతి) - ఈ మూడూ మిళితమై శ్రామికవర్గంయొక్క అవసరాల కనువైనట్లు "నిర్మాణ కళ"ను పోషించుచున్నవి. ఈ కళలోని ఒక భాగమే "నగర నిర్మాణము." "నగరనిర్మాణము"ను రష్యనులు అనేక రసాలతో ప్రారంభించారు. జారులనాటి రష్యాలో అసంఖ్యాకములైన దరిద్రపు గ్రామాల నడుమ, వీటిని దోచుకొనే పెద్ద నగరాలు కొద్ది ఉండేవి. సోవియట్ సంయుక్తరాష్ట్రమందంతటను ఫాక్టరీలును, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలును స్థాపింపబడినందున లెక్కలేనన్ని పట్టణాలు లేచినవి. రస్తాలు, విశ్రాంతి

కిని కాలయాపనకును అనువైన విహారస్థలాలు, ఫాక్టరీలు, శిశుపోషణ శాలలు, పాఠశాలలు, వ్యాయామశాలలు, పచ్చిక ఆటబయళ్ళు - మొదలైన వాటిని ఒక పద్ధతి ననుసరించి అమర్చవలసి వచ్చినది. అసమానత్వంయొక్క అర్థశూన్యత నుండి మొదటిసారి కళా పోషకుల కొరక నూతనమార్గం దొరికినది. ఇందులో, ఒక గుడిసెయొక్క స్వల్పతను, దారిద్ర్యాన్నిచూచి ప్రక్కనున్న గంభీరమైన రాచనగరును పరిహసించడానికీ వీల్లేదు. ఒక దేవాలయంయొక్క ఔన్నత్యంచూచి ప్రక్కనున్న బోగంకొంప బూతుకు ఇగిలించడానికి వీల్లేదు.

నూతన నగరనిర్మాణంతోపాటు పురాతన నగర పునర్నిర్మాణంకూడ ఏక కాలంలో సాగినది. మాస్కోలో రస్తాలు, విశాలమైన బాటలు, శ్రామికుల ఇండ్లు, విహారస్థలాలు, భూగర్భ రైలుమార్గమూ కొత్తగా నిర్మింపబడినవి. ప్రాచీన కాలంలో భారత దేశంవంటి దేశాల్లో నగరనిర్మాణం కొంతవరకు ఒక విధానం, ఒక ఫక్కీ, ఒకమార్గాన్ని నడిచినదిగాని, దురదృష్టవశాత్తు, కళగామాత్రం వికసించిందిగాదు. తాను రూపుమాపలేని నికృష్టపు పేదరికంతోపాటు సంపద బలవంతాన జీవించవలసి వచ్చింది. అందువలన ఘర్షణ తప్పిందికాదు. సఖ్యత ఎందునా కనబడదు. మధ్యయుగపు భారతదేశం ద్రావిడుల దేవాలయాలద్వారా కొంత నిర్మాణ కళను సాధించగల్గిన మాట వాస్తవమే. ఈ దేవాలయాలనుంచి దేవాలయ నగరాలు వ్యాపించినవి. ఈ నగరాలు అన్నిజాతులవారును ఉండడానికి అనువుగా, అందచందాలతో, అతి సౌకర్యంగా ఉండేట్లు నిర్మింపబడేవి. కాని, ఈ విధానంలోని స్వతస్సిద్ధమైన లోట్లు కారణంగా ఈ నిర్మాణకౌశలం క్షీణించడమేగాకుండా త్వరలోనే అస్తమించినది. పురాతన హిందూశిల్పశాస్త్రకారుల స్వప్నాలు నేడు సోవియట్ల దేశంలో నిజరూపమున కనబడుచున్నవి. ఫాక్టరీలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు — వీటినిచుట్టి నగరములు నిర్మింపబడినవి. వంకరలేని వెడల్పైన రస్తాల నానుకొని ఇండ్లు, పాఠశాలలు, వైద్యశాలలు, నాటకశాలలు, క్లబ్బులు, సినిమా హాలులు నిర్మింపబడినవి. ప్రతి రస్తాయు విశాలమైన ఒక విహారస్థలానికో, ఉద్యాన వనానికో దారితీస్తుంది. ప్రకృతి బహుమానాలైన వెలుతురు, గాలి రెండూగూడా ప్రతి ఒకరికిని, ప్రతి భవనానికిని పూర్తిగా లభించేటట్లు నగరములు నిర్మింపబడియున్నవి.

## చి త్ర క ళ

ఫ్రాన్సులోని "విప్లవకళా ఉద్యమాలు" రష్యాలోని చిత్రకళకు దోహదమిచ్చినవి. ఫ్రాన్సులో సంఘానికిని, కళలకును సంబంధం లేకపోయినది. ఈ కళలు అచ్చటి సాంఘిక విధానాన్ని మించి ముందుకు సాగినవి. పోస్ట్ ఇంప్రెషనిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, అతివాస్తవికత మొదలైనవన్నీ ఈ తిరుగుబాటుకు ప్రత్యేక సందర్భాల్లో ఇవ్వబడిన వేరు వేరు పేర్లు. ఈ నూతన పోకడలతో పెట్టుబడిదారీ సంఘం రాజీకి రాలేకపోయినది. అందువలననే ఈ నూతన పోకడలు చక్కగా పెరగడానికిని, గట్టిగా పాతుకొనిపోవడానికిని వాటిని వేరు వాతావరణంలో, వేరు మట్టిలో (రష్యాలో) నాటవలసి వచ్చినది. చిత్రకారులకు, పాశ్చాత్య దేశాలలో నిరాకరింపబడిన అవకాశాలు, ప్రోత్సాహం, మెప్పు - అన్నీ గూడ సోవియట్లలో దొరికినవి. గాగిన్ చిత్రించిన విషాదచిత్రం (రొట్టెముక్కను ముష్టి ఎత్తడం) వంటి వాటికి ఇకముందు అవకాశమే లేదు.

ఆరంభంలో కొంతకాలము ఈ పాశ్చాత్య పోకడలన్నీకూడా దూరప్రాచ్యపు పోకడ లనేకంతోబాటు సాగుతూ వచ్చినవి. కాని, వీటన్నిటిని సమ్మిళిత మొనర్చిన నూతన సోవియట్ కళ ఇటీవల నారంభింప బడినది. ఈ కలయిక నేటికిని సాగుతూ ఉండడానికి కారణం సోవియట్లు సజీవమైన దేశమై యుండడమే. చిత్రకళయొక్క పోకడలకు విశాలమైన పరిమితి గలదు. నికొలెయ్ పెర్సొ చైనా చిత్రకళను ఉద్ధరిస్తున్నాడు. ఇతను కొనాష్‌విచ్‌ని చిత్రించాడు. ఈ చిత్రం చైనాలో వాడుకలోనున్న సంగ్ పోకడ ననుసరించియున్నది. ఇతడు మింగ్ పోకడ ననుసరించి మరొక చిత్రాన్ని చిత్రించాడు. బ్రూనే తాను చిత్రించిన "హేమంత ఋతువు"లో మింగ్ పోకడల ననుసరించాడు. సమొఖెలోవ్ చిత్రించిన "రష్యన్ పడుచు" అన్న చిత్రంలో గాగిన్ పోకడలు కనబడుచున్నవి. అంటొవ్ చిత్రించిన "ప్రేమ" అన్న చిత్రంలో మటిస్సీ పోకడలు స్పష్టమౌతున్నవి. రయ్‌జాస్కి చిత్రించిన "మంచుపై నడచు పడుచు" లోను కట్జమన్ చిత్రించిన "కుట్టుపనివారు" అన్న చిత్రంలోను రాజపుత్ర పోకడలు విదితమౌచున్నవి. ఈ చిత్రాలన్నీ ఉంచబడిన భవనం — ట్రెట్స్‌కోవ్ - పూర్వం ఒక రాచనగరుగా ఉండేది. నేడు ఈ భవనం ఒక చిత్రకళా ప్రదర్శనశాలగా శోభిల్లు చున్నది.

## శిల్పకళ

శిల్పకళగూడా ఇట్టి పోకడలనే అనుసరించినది. కాని, చిత్రకళకు దోహద మివ్వగల్గిన పాశ్చాత్య పోకడలవంటివి ఏవీ, శిల్పకళాభివృద్ధి కనువైనవి పాశ్చాత్య రంగంలో అగుపడలేదు. ప్రాచ్యదేశాలైనను, శిల్పకళలో, సోవియట్లకు మార్గ దర్శులు కాలేకపోయినవి. మధ్య యుగములనాటి ప్రాచ్య శిల్పకళకును, ఆధునిక శిల్పకళకును చాలా వ్యత్యాసమున్నది. ఆరంభములో, విప్లవ ఫలితముగా శిల్పకళ అనేక పోకడలు పోయినది. కాని, శాంతి నెలకొల్పబడిన తర్వాత శిల్పకళగూడ నిర్మాణానికి తోడ్పడినది. విశాల నగరము లపారముగా పెరుగుటవలన నిర్మాణ కళకు మాత్రమేగాక శిల్పకళకుగూడ పూర్తి అవకాశములు గల్గినవి. పూర్వపు రష్యను పోకడలనుండి "ఆకారం" "రూపం" రెండూ పునరుద్ధరింపబడి, రాతి లోను, సిమెంటులోను, దంతములోను, కొయ్యలోను, లోహములోను నూతన రూపమును దాల్చినవి. నూతన సంఘంలో చైతన్య మేర్పడినది గనుక పూర్వపు ఆకారాలకూ ఇప్పటి రూపాలకూ వ్యత్యాసముండక తప్పినదికాదు. నూతన శిల్ప కారులు - అతి మేధావులు అనేకులు ముందుకొచ్చినారు. జెలెన్‌స్కీ సున్నపు రాతిలో చెక్కిన "కూర్చున్న స్త్రీ" అన్న విగ్రహం అతి సుందరముగా ఉన్నది. శరీరానికి తగిన చేతులు, తల, అంగసౌష్ఠవానికి అనువైన ఆకారం - నిజంగా ఈ విగ్రహం దేవతాసృష్టియనే చెప్పవచ్చు. అంద్రెయేవ్ చెక్కిన "వ్రాస్తూన్న లెనిన్" అన్న విగ్రహంలో మహత్తరశక్తి ప్రస్ఫుటమౌతున్నది. శిల్పకళ కేవలం జాతియొక్క స్వభావాన్ని ప్రకటిస్తుందని పెట్టుబడిదారీ చిత్రకారుల వాదన. "ముస లమ్మ తల" అన్న శిల్పంలో అంద్రెయేవ్ పెట్టుబడిదారీ చిత్రకారుల వాదన అబద్ధ మని ఋజువుపరచినాడు. "ఎఱ్ఱసైన్యపు యోధుడు" అన్న శిల్పం పైకి ద్రావిడ పోకడగా కనబడినను ఉత్సాహంలోను, శక్తిలోను ఆధునికమైనది.

సోవియట్ల దేశంలో "గోడలకంటించే చిత్రాలు" గూడ చిత్రకళల ఔన్న త్యాన్ని పొందగల్గినవి. ఈ చిత్రాలను "పోస్టర్స్" అంటారు. వీటికి సామాన్యత, శక్తి రెండూకూడా అత్యవసరం. "పోస్టర్స్"లోని బొమ్మలు స్పష్టముగా ఉండ వలెను. వాటి రంగులు దృష్టి నాకర్షించేవిగా ఉండవలెను. పెట్టుబడిదారీ దేశాల్లోని పోటీదారీ జీవితంనుంచి విముక్తి నొందినవి గనుక ఈ "పోస్టర్స్" తలనూనెలను,

సబ్బులను, ఇంగువలను ప్రదర్శించడంలేదు. ఎఫిమోవ్ చిత్రించిన "సోవియట్ నాయకుడు"; అల్పరోవ్ చిత్రించిన "సమిష్టి పద్ధతి విజయం" మొదలైన వాటి వలెనే "పోస్టర్స్" కేవలం సంఘజీవితమును చిత్రించుచున్నవి - ప్రతి బింబించు చున్నవి.

## వాఙ్మయము

పురాతన గ్రంథములద్వారా ఆధునిక ప్రపంచమునకు గొప్ప వాఙ్మయము సంక్రమించినది. కాని, ప్రపంచమంతటను పెట్టుబడిదారులు ఈ అమూల్యమైన ఆస్తిని దుర్వినియోగ పరచినారు. ముఖ్యముగా 19, 20 వ శతాబ్దాలలో గ్రంథ కర్తలదృష్టి అతి సంకుచితమైనది. "వ్యక్తిగత ప్రేమ"ను గురించే గ్రంధకర్త లందరూ వ్రాసేవారు. ఈ ప్రేమగూడా పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ననుసరించి బూటకంగా మారడంవలన ఈ రచనలలో సత్య మడుగంటినది. సాంఘికావస్థ ననుసరించి గ్రంధకర్తలు బూటకములు వ్రాయుట సహజమైనది. సాధారణముగా, గ్రంధకర్తలందరును, తమ పూర్వీకులు ఏదో ఒకవిధముగాదోచి, దాచిన డబ్బును పెట్టుబడిపెట్టి, కుర్చీ దిగకుండా సుఖజీవనాన్ని గడిపేవారేగాని కోట్ల కొలది మానవులు రోజుకు 12 గంటల చొప్పున చెమట ఓడ్చి, కష్టించికూడ కడుపునిండా కూడులేక కృశించుచు చేసే రోదనలను ఎరిగినవారుకారు. ఈ గ్రందకర్తలు తమ చేతులతో తాము కష్టించి, సంపాదించి, కుడిచిన పాపాన బోయినవారుగారు. అదనపు విలువవలన కలిగిన ఆదాయంలో భాగస్వాములైనవారు కొందరు, అదనపు విలువవలన కలిగిన ఆదాయపు మేలునుగురించి,తమతోటి భాగస్వాముల ఆనందం కోసం రచించేవారు కొందరు - వీరే పెట్టుబడిదారీ ప్రపంచపు గ్రంథ కర్తలు.

ఈ దుస్థితిని రష్యాలో జరిగిన సాంఘిక విప్లవం మార్చగల్గినది. మానవుని నిజస్థితిని, అతని కష్టజీవితాన్ని గురించి రచించగల నూతనవర్గము బయలుదేరినది. ఈ నూతనవర్గముయొక్క ఉత్సాహ, స్థైర్య, సహజతలముందు పెట్టుబడిదారీ గ్రంథకర్తలను శాశ్వత గ్రహణ మావరించినది. శోకాన్ని, సందేహాన్ని శ్రామికవర్గము జయించినది. వ్యక్తిగతంగా నిరుత్సాహకరమైన విషయములు ఇప్పుడు ప్రజా సమూహములయొక్కయు, వర్గముల యొక్కయు, జాతుల యొక్కయు సంతోషాన్ని - దుఃఖాన్ని ప్రదర్శించుటకు ఉపయోగింపబడుచున్నవి.

విప్లవం పూర్తికాగానే బుల్‌యకోవ్ తన "తెల్లభటుడు" అన్న ఉద్గ్రంథంలో ధనిక వర్గమువలని నిరుపయోగతను విశదపరచినాడు. వ్యక్తికి ఎన్ని సద్గుణములు, ఎంతటి తెలివి తేటలు, ఏపాటి నేర్పరితనము ఉన్నను, పెట్టుబడిదారీ సంఘంలో ఇవన్నీ నిరుపయోగములనీ, నిస్సహాయములనీ, ఆ సంఘానికి డబ్బే ప్రాణమనీ బుల్‌యకోవ్ ఈ గ్రంథంలో విశదీకరించినాడు. ఈ గ్రంథంలో కథానాయకుడు విప్లవద్రోహియైన ఒక సైనికోద్యోగి. పెట్టుబడిదారీ ప్రపంచపు నిరుపయోగాన్ని, అందులో వ్యక్తి అనుభవించే నిస్సహాయతను ఈతడు కడపటికి గ్రహించినాడు. తాను రక్షించుచున్న కోటమీదికి ఎఱ్ఱసైన్యములు జయప్రదముగా రాసాగినవి. అప్పు డతనిలో మార్పు కల్గినది - తల తిరిగినది. తనకోట, తాను, తనపరివారము కొద్దిసేపటిలో నాశనము గానున్నారని గ్రహించి, వెంటనే తన సోదరునిపిలిచి విప్లవద్రోహులైన "తెల్లసైన్యముల"ను వదలి, వాటిని ధ్వంసముచేయుటకు ఎఱ్ఱ సైన్యమును చేరమని సలహానిచ్చినాడు.

సోవియట్ల ప్రజలచే ఎక్కువగా ప్రేమింపబడుచున్న రచయిత - గోర్కీ - రచనలో పూర్వీకుడు. తానీ నూతన ప్రపంచానికి చాలడని అతడే ఎరుగును. అందు కనే కొత్త రచయితలకు దారి వదలినాడు. నూతన పోకడలకు ప్రోత్సాహము నిచ్చినాడు. "రొట్టె", "ఐశ్వర్యవంతుడు" మొదలైన నాటకాలు దేశమంతటను ప్రదర్శింపబడినవి. "ఐశ్వర్యవంతుడు" అన్న నాటకములో గ్రంధకర్త — పొగొడిన్ - సినిమా ఫక్కీని కొంత ఉపయోగించినాడు. ఈ నాటకములోని దృశ్యములు చలన చిత్రములలోని దృశ్యములవలె అతి వేగముగా మారడమేగాక విస్పష్టముగాగూడ ఉన్నవి. ఈ నాటకములోని కథ సామ్యవాద పోటీనిగురించి చెప్పుచున్నది. ఇందులోని పాత్రధారులు అందరును ఐశ్వర్యవంతులు; పెట్టుబడిదారీ పరిపాలనా ఫలితముగా మిగిలిన దొంగ, వేశ్య, లంజలు కుదిర్చేవాడు, తాగుబోతు - వీరు ఈ కథానాయకులు. "రొట్టె" అన్న నాటకము సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను గురించి చర్చించినది. ప్రతి నాటకముయొక్క ముగింపు సమంజసముగా ఉన్నది. వేరువిధముగా నాటకమును ముగించుటకు వీలులేదని ప్రేక్షకులకు తోచేట్లు నాటకము లన్నియు ముగింపబడియున్నవి. నవలా రచనలలో అనేక పోకడ లేర్పడినవి. విప్లవారంభ మప్పటి ఉత్సాహాన్ని గ్లాడ్‌కోవ్ రచించిన "సిమెంట్" నిరూపించినది. నేటి ప్రౌఢదశను ఇవనోవ్, షొలొకోవ్, అలెక్సి

టాల్‌స్టాయ్‌గార్ల రచనలలో చూడనగును. రష్యను పద్యకావ్యాల ననువదించిన యెడల, అనువాదాలలో వాటి సహజమాధుర్య మగుపడదు. మెయ్‌కొవస్కీవంటి ఉత్తమ కవిరచనలుగూడ, అనువాదములో వాటి సహజ సౌమనస్యము, మాధుర్యము కోల్పోవక తప్పదు. మెయ్‌కొవస్కీ రచనల ప్రభావాన్ని పరిచయ పరచుటకు, మచ్చుకు, అతని గీతాలు రెండింటి అనువాదమును ఈ క్రింద పొందుపరచడ మైనది.—

"కవిసత్తములారా ? నౌకర్లు, నగళ్ళు, ప్రేమ, వికసించు కలువలు - ఇవి మీకు వెగటువేయుటలేదా ? * మీరు కవిసత్తములయిన కళల ముఖమున నేను ఉమ్మివేసెదను. నేను దుకాణము పెట్టుకొనియో, మారకపు బేరములోనికి దిగియో, డబ్బు దోచుకొని బొజ్జ పెంచుకొనుచు కూర్చుండెదను. లేదా, దగ్గరనున్న సారాయి దుకాణములో తప్ప తాగి తందనాల పాటలతో నా జీవితమును త్వరలో ముగించెదను."

మరొకటి—

"యుద్ధం ! యుద్ధం ! సామ్రాజ్య వాదమున కనుగు బిడ్డ - చంపడమున కుఱుకుచున్నది. ప్రపంచమంతటిని ఆవరించినదీ పిశాచము. శ్రామికులు గర్జించుచున్నారు - చైనాపై చేతులు తీసివేయుడు !....ఓయ్, రాజకీయ వేత్తలారా ! అంతర్జాతీయ సమితులతోను, అర్థములేని ఉపన్యాసములతోను మీ తోకలనాడించకుడీ ! రక్కసులారా ! పదండి వెనక్కు ! చైనాపై చేతులు తీసివేయుడు !....రాయబారపు భవనములలో కూర్చొని రాజకీయవేత్తలు కుట్రల నల్లుచున్నవారు....ఈ అల్లికలను - సాలీడు గూండ్లవలె - తుడిచివేయగలము. కూలీ ! చాలు ! చల్లగా, వారు క్రింద కాలుపెట్టకుండా వారిని రిక్షాలలో లాగినది చాలును. నీ వెన్నెముకను

(1) "కవిరాట్టుల్ల జులైన నీతనయు లింకన్ స్త్రీలపాలిండ్లపై। జివురుం జెక్కులపై దృగంచలముపై, జెన్నారు నూగారుపై। దవులం జిత్తము లుంతురో ? సమర సంధాసక్త రౌద్రక్రియో। త్సవ సంధాయక భావిబంధ రచనల్ సంధింతురో ?" అన్న శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి "మాతృశతకము"లోని మాటలు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

కొద్దిగా సర్దుకొనుము. చైనాపై చేతులు తీయుడు!.... నిన్ను (చైనా?) వలసరాజ్యముగా చేసుకొనవలయునని చూచుచున్నారు - ఈ గోముఖ వ్యాఘ్రములు...."

అలెక్సిటాల్‌స్టాయ్ గీతములను ఇంతవర కెవ్వరును అనువదింప ప్రయత్నింపకుండుట ఒకవిధముగా అదృష్టమనవచ్చును. అనువాదమునుబట్టి యాతని కవితా మాధురినిగుర్తించుట దుస్సాధ్యము. బ్లాక్ కేవలం పూర్వీకుడు. అతని 'పంద్రెండు' గూడ కేవలం పాత ఫక్కీనే నడచినది.

ఇంకను సోవియట్లు తమ సొంత పోకడలను కనుగొనలేదు. ఇంకను సోవియట్లు కళల నభ్యసించుచున్నవి. వాటి అడుగులు తడబడుచున్నవి; వణకుచున్నవి; ఒక్కొక్కప్పుడు తొట్రిలుచున్నవి గూడను. 19 వ శతాబ్దములో పొడచూపిన కళోద్ధారకులు ఇంకను సోవియట్లలో అగుపడలేదు.

## నాట్యకళ

రష్యను నాట్యరంగ మత్యున్నతస్థితిలో నుండుటకు కారణము ప్రజల సహజ స్వభావమే. యూరపులోని నటీ, నటు లెవ్వరును - ఈ వృత్తి నవలంబించినవారైనను సరే - రష్యను నటీ, నటులవలె అభినయమును అత్యున్నత స్థాయికి తేలేరు. రష్యను ప్రజల స్వభావానికితోడు వారికి శాస్త్రీయమైన తరిఫీదు ఇవ్వబడుచున్నది. అనేక నాటక బృందములు తమ సొంత ఫక్కీని ప్రారంభించి, తమకు సంబంధించియున్న పాఠశాలలలో తమ నూతన మార్గములను నేర్పుచున్నవి. ఈ బృందములలో ప్రఖ్యాతిగాంచినది "మాస్కో ఆర్ట్ థియేటర్." జారుల కాలములో నాట్యశాలలు యూరపుకు చెందిన రష్యాలోమాత్రమే ఉండేవి. జారు సామ్రాజ్యమునకు చెందిన రాష్ట్రములలో సహజముగా నేర్పరులైన నటీ - నటులున్నను, నియమములేని నిషేధములు, మితములేని పన్నులు కారణముగా వీరు పైకి రాలేక పోయేవారు. ఇప్పుడీ అడ్డంకులన్నియు తొలగింప బడినవి. డబ్బు సమస్యగూడ పరిష్కరింప బడినది. శ్రామికవర్గపు జీవిత వ్యయము నానాటికిని హెచ్చుచునే యున్నందున నాటకములకు గిరాకీ హెచ్చినది. తత్ఫలితముగా దేశమందంతటనుగూడ నాట్యశాల లేర్పడినవి. ప్రతిరాష్ట్రము, ప్రతి పట్టణము, ప్రతి

ఫ్యాక్టరీకూడ నేడు తన సొంత నాట్యశాలను కలిగియున్నది. నాట్యశాలల సంఖ్య కొన్ని వేలకు మించినది. నటీ - నటుల సంఖ్య వేలుదాటి లక్షలలో పడినది.

నాటకములందలి కథల దృష్టిగూడ విశాలతను పొందినది. క్రొత్త క్రొత్త కథ లేర్పడినవి. నాట్యకళయొక్క రూపమే మారిపోయినది. శ్రామిక వర్గము అపారముగా ప్రేమించుచున్న పూర్వగాథలే గాక, సోవియట్లు పలువిధములైన నూతన జీవితమునుంచిగూడ కొన్ని ఘట్టములు నాటకములలో ప్రదర్శింపబడు చున్నవి. ఈ నాటకములలోని కథానాయకుడు దిక్కుమాలిన యువతి నొకామెను రక్షించినంత మాత్రమున ధీరుడైన, మందబుద్ధిగాడు. సామ్యవాద నిర్మాణములో మనస్ఫూర్తిగా, అత్యుత్సాహముతో పాల్గొనుచున్న ధీరుడే ఈ నాటకములోని కథా నాయకుడు. పెట్టుబడిదారీ జీవితములోని నిరుత్సాహకరములైన విషయము లను గురించి ఈ నాటకములు చర్చించుటలేదు. సామ్యవాద జీవితములో కల్గు చున్న సమస్యలు, ఘర్షణలు, ప్రయత్నములు మొదలైనవాటిని ప్రదర్శించుటకే నేటి నాట్యకళ పాటుబడుచున్నది. పోకడలలోకూడ నాట్యకళ క్రమేణా సహజ త్వమునుండి తన్మయత్వములోనికి దారి తీయుచున్నది. ప్రతి విషయమందును — అతి స్వల్పవిషయమునందుకూడ -- రష్యనుల ప్రత్యేక స్వభావమైన "వాస్తవికత" ప్రస్ఫుట మౌచున్నది.

నాటకములలోని రంగ నిర్మాణము అత్యున్నతస్థితిని పొందినది. మన నాట్య శాలలలోని ఇరుకైన రంగములవలెగాక, సోవియట్ నాట్యరంగమునకు పొడవు, వెడల్పు, ఎత్తుగూడ నున్నవి. రంగముమీదికి నటులు వచ్చురీతి, ఒకరితో నొకరు కలియు విధము, వారి దుస్తులు, వారి ఛాయలు, వారి ఆకారములకు తగినట్లు వారి వెనుకనున్న పరదాలు, ఆ పరదాలమీది దృశ్యములు -- మొదలైనవాటి నమర్చు టలో రష్యనులు మిగత ప్రపంచమును మ్రింగివేసినారు. ఈ నిపుణతలో వారికి వారే సాటి. ప్రఖ్యాతిగాంచిన దృశ్యములలో కొన్ని ఈ దిగువ నుదాహరింపబడి నవి:—జర్కీ రచించిన "ఆనందవీధి"లోని దృశ్యములు; విషెన్‌వెస్కీ రచిం చిన "ఆశాపూరితమైన విషాదగాధ"లోని దృశ్యములు; ఆస్ట్రోవ్‌స్కీ రచించిన "అర ణ్యము"లోని దృశ్యములును. ప్రజాకర్షణను చూరగొనునది నాటక మొక్కటి మాత్రమేకాదు. ఒకే నాటకమునకు వేరు వేరు నాటక బృందములు వేరు వేరు

రూపముల నిచ్చుచున్నవి. ఈ నాటక బృందములలో ప్రఖ్యాతిగాంచినవి "మాస్కో-ఆర్ట్‌థియేటర్", "మెయర్‌హోల్డ్", "కమర్‌నె".

## సినిమా

సోవియట్ల సుప్రసిద్ధ కళా ఔన్నత్యము, బహుశ, సినిమా రంగములో ఏర్పడినదని అనదగును. విప్లవపు రోజులలోని ఉద్రేకము ఇసెన్ స్టైయినును ముందుకు తెచ్చినది. ఇతడు సినిమా కళలో గొప్ప మార్పును తెచ్చినాడు. ప్రజా సమూహమును, వేనవేలు ప్రజలను తన చలన చిత్రములలో ముఖ్యపాత్రధారులుగా ప్రదర్శించినాడు. వ్యక్తిగత పెట్టుబడిదారీ విధానమునకు విరుద్ధముగా సామ్యవాద సంఘమందు వ్యక్తికన్నను సమాజమున కెక్కువ విలువయున్నదని నిరూపించినాడు. ఈతని "పొటొమ్‌కిన్" ఇప్పటికే చాలాగొప్ప పేరును పొందినది. చలన చిత్రముల చరిత్రలోనికి ఈ చిత్ర మెక్కగల్గినది. ఈ చిత్రమును చూచిన వారు బారబస్సి వాదనను మరచిపోలేరు. మరచిపోవుదమన్నను మరపురాని దృశ్యము లీచిత్రములో అనేకమున్నవి — నికొలస్‌యొక్క మేడమీదినుంచి బరువైన కోసక్ బూట్లు (పాదరక్షలు) దిగడము; శవములు నిస్సహాయముగా ప్రాణములుపోయీ, పోక పడియుండడము; బిడ్డ పరుండిన తొట్ల ఖాళీగానున్న అతి విషాదకరమైన దృశ్యము మొదలైనవి.

ప్యుడొవ్‌కిన్ వ్యక్తి కెక్కువ ప్రాధాన్యమిచ్చి తన చలనచిత్రములందు సమాజమును పశ్చాద్భూమికగా నుపయోగించినాడు. ఈతని చిత్రములలోని నాయకుడు ఉద్రేకముతో, కోపముతో, కవితతో ప్రేక్షకులను సంబోధించును. ఈ నాయకుని ఉద్రేక, ఉత్సాహముల కెక్కువ విలువనిచ్చునది పశ్చాద్భూమిక. చలనచిత్రములలో ప్యుడొవ్‌కిన్ సృష్టించిన "తల్లి", "సెంట్‌పీటర్స్‌బర్గ్", "అంత్యము", "ఆసియామీది తుపాను" మొదలైనవి అత్యుత్తమమైనవని ప్రపంచమంతయు కొనియాడినది.

పైని చెప్పబడిన రెండు పోకడలను - ఇసన్‌స్టైయిన్, ప్యుడొవ్‌కిన్‌ల పోకడలు - డొల్‌జెంకొ సమ్మిళిత మొనర్చినాడు. ఈ ముప్పురిని గురువులుగా, మార్గదర్శకులుగా భావించి అనేకులు మేధావులు బయలుదేరి సోవియట్ల చలన చిత్ర కళకు దోహదమిచ్చుచున్నారు - నూతన పోకడలను స్థాపించగల్గినారు.

రష్యను భాషను అర్థంచేసుకొనలేని విదేశ ప్రేక్షకులలోగూడ ఈ చిత్రములు రేకెత్తించగల ఉత్సాహ, ఉద్రేకములకు మితిలేదు. టుర్కిస్థాన్ - సైబీరియా రైలుమార్గముయొక్క ఆవశ్యకతను గురించి ప్రబోధించుటకై "టర్క్ - సిబ్" అన్న చలన చిత్రమును సోవియట్లు తయారుచేసినవి. ఈ చిత్రము అమెరికాలో చూపబడినప్పుడు, ప్రేక్షకులందరును అందలిదృశ్యములనుచూచి ఉద్రేకపూరితులై తాము సోవియట్ ప్రజలనుకొని చిత్రము ముగియగానే "తప్పక మనం టర్క్ — సిబ్ రైలుమార్గమును స్థాపించవలెను" "తప్పక మనము టర్క్ - సిబ్ రైలుమార్గమును స్థాపించవలెను" అని కేకలువేయ మొదలిడిరి.

ఇన్నివిధములుగా సోవియట్లు కళలను వాటి పూర్వపు హీనదశనుంచి ఉదరించ గల్గినవి.

---



మార్క్సు

# 2. విప్లవం - అంతర్యుద్ధం - ఐక్యం

(జ్యోతి బసు)

ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధం మూడేండ్లలో (1914—17) లక్షల జనం చంపబడ్డారు: కోట్ల జనం గాయపడ్డారు. ఆర్థిక పతనం కారణంగా యుద్ధరంగం లోని సైనికులకు ఆహారం, బట్టా, యుద్ధసామగ్రి కొరతబడ్డది. పెట్టుబడి దారులూ, భూస్వాములూ కోట్లకొలది డబ్బు చేర్చుకుంటున్నారు. కాని, వారైనా జారు చక్రవర్తి సామ్రాజ్యవాద యుద్ధాన్ని జయప్రదంగా సాగించగలడని నమ్మ లేక పోయారు.

జారు ప్రభుత్వం శ్రామికులను, రైతులను, మేధావులను, ఆఖరుకు పెట్టుబడి దారులను — భూస్వాములనుకూడా విరోధం చేసుకుంది.

పెట్టుబడిదారులు మిత్రరాజ్యాల సహాయంతో రాచనగరులోనే - ప్రజలతో నిమిత్తంలేకుండా - తిరుగుబాటును లేవదీసి జారు చక్రవర్తిని అధికారంనుంచి తొలగించాలని చూశారు. తద్వారా, ప్రజాబాహుళ్యం తిరుగబడకుండా తమ అధి కారం స్థిరపడుతుందనుకున్నారు. కాని, శ్రామికులు తమ ఇష్టంవచ్చిన రీతిని జారును పదభ్రష్టుని జేశారు.

1917 జనవరి, ఫిబ్రువరి నెలలలో శ్రామికవర్గం నివసించే ప్రాంతాలన్నీ సమ్మెలు, ప్రదర్శనాలతో వణకిపోయాయి. స్త్రీ, పురుషులు భుజాలు రాచుకుంటూ జారు ప్రభుత్వానికి విరుద్ధంగా, యుద్ధానికి వ్యతిరేకంగా, పస్తుండజాలమంటూ ప్రద ర్శించారు. ఆర్థిక కారణాలవల్ల ప్రారంభమైన సమ్మెలుగూడా రాజకీయ సమ్మె లుగా మారాయి. రాజకీయ సమ్మెలు కాలం గడచినకొలదీ జారు పరిపాలనా విధా నానికి వ్యతిరేక ప్రదర్శనాలుగా పరిణమించాయి. జారుయొక్క నమ్మకమైన బంట్లు గూడా ప్రజలతోచేరి తిరుగుబాటును సాగించారు.

ఈ విధంగా బూర్జువా - ప్రజాస్వామ్య (ధనికవర్గ) విప్లవం పెట్రొగ్రాడ్ * నగరంలో ప్రారంభమై ఇతర ప్రాంతాలకు వ్యాపించింది.

1905 లో విప్లవాన్ని కొనసాగించవలెనన్న ప్రజల ప్రయత్నం రక్తంలో కలిసిపోయి విప్లవం విఫలమైనప్పటినుంచీ శ్రామికవర్గం తగిన జాగ్రత్తతో తయారైంది గనుక 1917 విప్లవం సులభంగా జయం పొందగల్గింది.

1917 విప్లవం రోజుల్లో (అక్టోబరు) రష్యాను ఉగ్రూతలూగించిన మహత్తర పరిస్థితులనుగురించి విశదంగా వర్ణించే బదులు అప్పటి పరిస్థితుల ప్రత్యేక స్వభావాల కొన్నింటిని గమనించిన ఈ సామ్యవాద విప్లవం ఏలా జయంపొందిందో బోధపడుతుంది.

శ్రామిక వర్గంయొక్క ప్రతినిధులైన బోల్షివిక్కులు ప్రజాబాహుళ్యం యొక్క పోరాటాలను బజార్లలో సాగిస్తూంటే, రాజీ ప్రయత్నాలు చేస్తున్న పార్టీలు - మెన్‌షివిక్కులు, సామ్యవాదవిప్లవకారులు - సోవియట్లలో తమ బలం ఎక్కువుండేటట్లు, రహస్యంగా, ఎత్తులు పన్నుతున్నారు. పైగా "సోవియట్ శ్రామిక - సైనిక ప్రతినిధుల కార్యనిర్వాహక సమితిలో" ఈ రాజీ ప్రయత్నదారులు తాత్కాలిక ప్రభుత్వాన్ని తామేర్పాటుచేయను అంగీకరించారు. ఈ తాత్కాలిక ప్రభుత్వంలో పెట్టుబడిదారివర్గంచేతి కీలుబొమ్మ అయిన మిల్‌యుకోఫ్ వంటి ప్రజా స్వామ్యవాదులు, గుచ్‌కోఫ్‌వలె అక్టోబరు విప్లవాన్ని సాగించినవారు, ధనికవర్గంయొక్క ఇతర ప్రతినిధులు, కెరన్‌స్కీవంటి ప్రజాస్వామ్యవాదులు ఉన్నారు.

ఈవిధంగా అధికారం ధనికవర్గంపాలైనందున ఈ బూర్జువా ప్రభుత్వంతో పాటు మరో మహత్తర ప్రజాశక్తి—"శ్రామికుల, సైనికుల ప్రతినిధు లేర్పరచిన సోవియట్లు"—ఏర్పడింది. ఈ శక్తియే నిర్మలమైన ప్రజాస్వామ్య సంస్థ. శ్రామి

* పెట్రొగ్రాడ్‌కు, పూర్వం సెంట్ పీటర్స్‌బర్గ్ అన్న పేరుండేది. బర్గ్ అన్న పదం జర్మను పదం గనుక ఆ పేరు కూడదని పెట్రొగ్రాడ్ అన్న పేరు పెట్టారు. 1917 విప్లవానంతరం ఈ నగరం లెనిన్‌గ్రాడ్ అని పిలవబడుచున్నది. సంవత్సరానికి పైగా ముట్టడి సాగించిగూడా జర్మను లీనగరాన్ని ఇంతవరకు వశపరచుకోలేక పోయారు.

కులు, రైతులు, సైనికులు వృత్తివారీగా తమ ప్రతినిధుల నెన్నుకున్నందున ఈ సంస్థ ఏర్పడింది.

రాజకీయాలంటే ఏమిటో ఎరుగని లక్షలాది జనం రాజకీయ జీవితంలో కురకడం కారణంగా అధికారాన్ని ధనికవర్గానికి ఒప్పగించవలసి వచ్చిందని లెనిన్ విప్పి చెప్పాడు. సంఖ్యలోను, భావాల్లోను అల్పసంఖ్యాకులైన భూస్వాములు, కొద్దిపాటి వ్యాపారులు, కొద్దిపాటి ధనికులు, మధ్యతరగతి ప్రజలు, సొంత భూమి గల రైతులు - వీరినే పెటీ బూర్జువా అంటారు ఆంగ్లంలో - బహు సంఖ్యాకులై వర్గచైతన్యంగల శ్రామికులను మించిపోయారు. ఈ పెటీ బూర్జువా లెల్లప్పుడు ధనికవర్గం నాయకత్వాన నడిచేవారు గనుక ఈ విప్లవ మప్పుడుగూడా ధనికవర్గానికి సులభంగా లొంగిపోయారు.

ఇలా ఉండిగూడా, ప్రపంచంలోని దేశాలన్నిటిలోకి జారుకాలపు రష్యా (1917 లో) అత్యంత విచ్చలవిడిగల దేశమై పోయింది. దేశంనుంచి వెళ్లగొట్టబడినవారు, ఖైదీలు తిరుగ వస్తున్నారు. విప్లవం ప్రారంభమైన నెలరోజులకల్లా లెనిన్, తదితర బోల్షివిక్ నాయకులు జర్మనీగుండా పెట్రొగ్రాడ్‌కువచ్చి చేరారు.

బోల్షివిక్ పార్టీ నాయకుడైన లెనిన్ వెంటనే, బూర్జువా ప్రజాస్వామ్య రూపానవున్న ఈ విప్లవాన్ని సామ్యవాద విప్లవంగా మార్చడానికి జరుపవలసిన కార్యక్రమాన్ని వివరించాడు. ఈ కార్యక్రమ వర్ణనను ఏప్రిల్ థిసిస్ అంటారు. ఈ థిసిస్‌లోని ముఖ్యాంశాలు - (1) ఆర్థికరంగంలో భూమినంతటినీ వశపరచుకొని జాతిపరంచేయడం; బ్యాంకు లన్నిటినీ ఏకంచేసి, ఒకే ఒక జాతీయ బ్యాంకు నేర్పాటుచేసి, దానిని "శ్రామిక ప్రతినిధుల సోవియట్" అధికారంకింద నుంచడం; ఉత్పత్తి, పంపక విధానాలపై అధికారం కలిగుండడం; (2) రాజకీయ రంగంలో పార్లమెంటరీ విధానాన్ని సోవియట్ ప్రజా ప్రభుత్వ విధానానికి మార్చడం.

స్వభావాన్నిబట్టి తాత్కాలిక ప్రభుత్వం పెట్టుబడిదారి ప్రభుత్వం గనుక సామ్రాజ్యవాద యుద్ధాన్ని సాగించుతుంది. అందు కెవ్వరూ సాయపడగూడదు. ప్రస్తుత ప్రభుత్వం అభివృద్ధి నిరోధక స్వభావం గలదని ప్రజలకు నచ్చజెప్పను వెంటనే ప్రచారం ప్రారంభింపబడాలి. సోవియట్లలో మెజారిటీ (హెచ్చు సంఖ్య) సంపాదించిననేగాని ప్రభుత్వంయొక్క రూపం, విధానం మారవు అని వాదించాడు

లెనిన్. లెనిన్ థీసిస్ (ఉపపాదన - వాదన), అనుకున్నట్లే ధనికవర్గం, మెన్‌షివిక్కులు, సామ్యవాద విప్లవకారులు (మధ్యతరగతి ధనికవర్గం) మొదలైన పెట్టుబడిదారి ముఠాలను రేకెత్తించింది. ఈముఠా లన్నిటికీ అపరిమిత ఆగ్రహం కలిగింది. కాని, బోల్షివిక్‌లు అంతాగూడ, ఎవరో కొద్దిమంది వ్యక్తులుతప్ప, ఎంతో తృప్తితో ఈ థిసిస్‌ను ఆహ్వానించారు.

అప్పటినుంచి పరిస్థితులు అతి త్వరగాను, కారణయుతంగాను ముందుకు సాగాయి. విప్లవాన్ని మరోమెట్టు ముందుకు సాగించుదామని బోల్షివిక్కులు ప్రయత్నిస్తూన్న సమయంలో తాత్కాలిక ప్రభుత్వం సామ్రాజ్యవాద యుద్ధాన్ని సాగించను పూనుకున్నది. 20-4-1917 న బోల్షివిక్కుల ప్రేరణపై "రహస్య ఒడంబడికలను బయటపెట్టండి," "యుద్ధం నశించుగాక," "సర్వాధికారం సోవియట్లపరం కావాలి" అన్ననినాదాలతో ప్రజలు దేశమంతటా ప్రదర్శనలను సాగించారు. తాత్కాలిక ప్రభుత్వం ఈ ప్రజా ప్రదర్శనలనుచూచి, ప్రజల క్రోధాన్ని గ్రహించి, భయపడి మిల్‌యుకోవ్, గుచ్‌కోవ్‌లను ప్రభుత్వంనుంచి తొలగించింది. మెన్‌షివిక్కులు, ధనికవర్గం, సామ్యవాద - విప్లవకారులు కలిసి "మిశ్రమ ప్రభుత్వం" ఒకదాన్ని ఏర్పరచారు. కాని ఈ ప్రభుత్వంగూడ పాతదారే పట్టింది. యుద్ధరంగంలో యుద్ధానికి సంసిద్ధమైంది. దేశంలో బోల్షివిక్కుల నణచను పూనుకుంది. ఈ ఎత్తులకు ప్రజలు లొంగలేదు గనుక పెట్రొగ్రాడ్ నగరవీధులు శ్రామికుల, విప్లవ - సైనికుల రక్తంతో తడిసిపోయాయి. మెన్షివిక్కులు, సామ్యవాద - విప్లవకారులు ధనికవర్గంతోను, తెల్లభటుల నాయకులతోను చేతులుగలిపి బోల్షివిక్ పార్టీనీ, ఆ పార్టీ ప్రచారాన్నీ ధ్వంసంచేయడానికి సిద్ధపడ్డారు.

ఈవిధంగా ఇంతవరకు రెండు ముఠాల చేతులలోనున్న అధికారం ఇప్పుడు కేవలం ఒక్క తాత్కాలిక ప్రభుత్వం చేతికివచ్చింది. ఈ ప్రభుత్వానికి నాయకులు - పునాదులు మెన్‌షివిక్కులును, సామ్యవాద విప్లవ కారులును. ఈ రెండుపార్టీల నాయకులే ప్రభుత్వానికి నాయకులయ్యారు. బోల్షివిక్ పార్టీ తన విప్లవ కార్యాని కనుగుణంగా అంతర్గతంగా పనిచేయ నారంభించింది. పెట్టుబడిదారుల నాశనం చేసి, సోవియట్లను అధికారాన ప్రతిష్ఠించను అవసరమైన సాయుధమైన తిరుగుబాటునకై కృషి సల్పింది. విప్లవ అభివృద్ధిలోని శాంతియుతమైన సమయం ముగిసింది. దాని బదులు సాయుధపు పోరాటాల సమయం ఆరంభమైనది.

తాత్కాలిక ప్రభుత్వానికి నాయకుడైన కెరెన్‌స్కీ శాంతిని, క్రమపద్ధతిని ఎలా నెలకొల్పడమని కొర్నిలోవ్‌తో చర్చించ నారంభించాడు. కాని కెరన్‌స్కీని ముందు నుంచుకొని, తాను వెనుకనుండి, తన ప్రాధాన్యత ఏమీ లేకుండా తన బలాన్ని ప్రదర్శించడం కొర్నిలోవ్‌కు మనస్కరించలేదు. అందువలన కొర్నిలోవ్ (జారుయొక్క సర్వ సేనాధ్యక్షుడు) "పితృభూమి" పేర పెట్రొగ్రాడ్ మీదికి దాడి సల్పాడు, తన "రాక్షసమూక"తో. కెరన్‌స్కీ, సామ్యవాద - విప్లవకారులు, మెన్‌షివిక్కులు ప్రజల కోపావేశానికి భయపడి కొర్నిలోవ్‌కు తమకు ఎలాంటి సంబంధం లేదని వెంటనే ప్రకటించారు. కాని బోల్షివిక్కులు ముందుకన్నా హెచ్చుగా శ్రమపడి, శ్రామికులను సమీకరించి కొర్నిలోవ్ సైన్యాలను తిరుగ గొట్టారు.

ఈవిధంగా ఆ గండం తప్పడమేగాకుండా ఈ ప్రయత్నం విప్లవశక్తిని స్పష్టపరిచింది, రాజీలు పడుతూన్న పార్టీల బ్రతుకు బహిరంగమై పోయింది. శ్రామికులు, రైతులు, సైనికులుగూడ బోల్షివిక్ పార్టీని చేరను ఎగబడ్డారు. సెప్టెంబరు వచ్చేటప్పటికి కార్మిక సంఘాల్లో హెచ్చు సంఖ్య బోల్షివిక్ పార్టీని చేరింది. అప్పటి ఎన్నికలనుబట్టి మాస్కో, పెట్రొగ్రాడ్ నగరాలలోని శ్రామికులు పూర్తిగా బోల్షివిక్కులతో చేరారని స్పష్టమైంది.

ఫిన్లాండునుంచి అక్టోబరు 7 వ తారీకున లెనిన్ పెట్రొగ్రాడ్‌కు వచ్చిచేరాడు. అక్టోబరు 10 న కమ్యూనిస్ట్‌పార్టీ కేంద్రసమితి సమావేశమై కొద్దిరోజులలో సాయుధపు తిరుగుబాటును సాగించ తీర్మానించింది. అట్టి తిరుగుబాటున కవసరమైన, అతి విశదమైన నిర్మాణ ప్రయత్నాలన్నీ చేయబడ్డాయి. పెట్రొగ్రాడ్ సోవియట్‌కు, బోల్షివిక్ కేంద్రసమితికి అప్పటివరకు ముఖ్యస్థానమైన స్మోల్‌నె విప్లవానికిగూడ ముఖ్యస్థాన మైంది. కాని కెరన్‌స్కీ విప్లవశక్తుల కవకాశమివ్వగూడదన్న ప్రయత్నంతో అక్టోబరు 24 న దాడి నారంభించాడు. అక్టోబరు 24, 25 తారీకులను ఎర్రభటులు శ్రామికుల సహాయంతో అపరిమిత సేనలను లేవదీసి, తయారుచేసి, తాత్కాలిక ప్రభుత్వ సైన్యాలను ఓడించి కీలక కేంద్రాలను స్వాధీన పరచుకున్నారు.

తాత్కాలిక ప్రభుత్వం తొలగింప బడిందని, రాష్ట్రాధికారమంతాగూడా సోవియట్ల పరమైందని 25 తారీకున బోల్షివిక్కు లొక కరపత్రాన్ని - 'రష్యను

పౌరులకు' - ప్రకటించారు. ఈ విజయోత్సాహంలో ఆరోజు సాయంకాలం స్మోల్ నెలో ద్వితీయ అఖిల రష్యను సోవియట్ల సమావేశం ప్రారంభింపబడింది. మెన్షివిక్కులు, సామ్యవాద - విప్లవకారులలో మితవాదులు తమకు ఓటమి తప్పదని తెలుసుకొని సమావేశం ముగియకముందే వెళ్ళిపోయారు. బోల్షివిక్కులకు గొప్ప మెజారిటీ ఓట్లు వచ్చాయి.

అక్టోబరు విప్లవం కేవలం ఒకదేశం సరిహద్దులలో జరిగిన విప్లవంమాత్రం గాదు. ఈ విప్లవానికి అంతర్జాతీయ ప్రాధాన్యత ఉంది. పెట్టుబడిదారి బానిసత్వాన్నుండి ఈ విప్లవం ఒక నూతన యుగానికి - సామ్యవాద స్వాతంత్ర్యయుగానికి - దారి తీసింది. ప్రపంచ చరిత్రలో మొదటిసారి పీడితవర్గం ప్రపంచ సామ్రాజ్యవాద రంగాన్ని భేదించి, సామ్రాజ్యవాద ధనికవర్గాన్ని అధికారంనుంచి తొలగించి, సామ్యవాద శ్రామిక వర్గాన్ని అధికారాన ప్రతిష్ఠించింది. సామ్రాజ్యవాద దేశాల్లో శ్రామిక విప్లవాలను ఈ విప్లవం రేకెత్తించింది. వలస జాతులనూ, వలస దేశాలనూ బంధించివున్న ఇనుపగొలుసులను భేదించి, జాతులకు స్వయం నిర్ణయ హక్కున్నదని ఈ విప్లవం గుర్తించడం మూలంగా వలసరాజ్యాల్లోని, అధినివేశ ప్రతిపత్తిగల దేశాల్లోని సామ్రాజ్యవాదాన్ని గొప్ప దెబ్బకొట్టగల్గింది. పైగా, ప్రపంచ సామ్రాజ్య వాదాన్ని ఎదిరి అన్నిదేశాల, అన్నిజాతుల పీడిత జనులు - శ్రామికులు నిలువడానికి అక్టోబరు విప్లవం వారి కొక ఆధారాన్నిచ్చింది. ఈ ఆధారమే సోవియట్లదేశం.

అక్టోబరు విప్లవం జయంపొందింది గాని తరువాత రెండు, మూడేండ్లపాటు సోవియట్ల దేశం పడరాని కష్టాలు పడవలసి వచ్చింది. సోవియట్ల ఆధిపత్యాన్ని స్థిరంగా స్థాపించను మొదట పూర్వపు ప్రభుత్వ విధానాన్ని ధ్వంసంచేసి దాని బదులు నూతన సోవియట్ ప్రభుత్వా న్నొకదానిని నెలకొల్పవలసి వచ్చింది. ఈ కార్య సాధనకు పూనుకున్నారు బోల్షివిక్కులు. పాత ఉద్యోగులను, మంత్రులను తొలగించి వారి స్థానాలయందు తగిన సోవియట్ అధికారులను నియమించారు. దేశంలోని పరిశ్రమలను క్రమపద్ధతిని సాగించను "సుప్రసిద్ధ జాతీయ ఆర్థిక సమితి" నొకదానిని నెలకొల్పారు. విప్లవ ద్రోహాన్ని, సబొటేజ్‌ని (ప్రభుత్వానికి విరుద్ధంగా ఉత్పత్తీ, పంపకమూ, రాకపోకల విధానాల విచ్ఛిన్నపరచడం) అణచను "అఖిల రష్యను అసామాన్య కమీషన్" నొకదానిని ఏర్పరచారు. ఎట్లైనై

న్యాన్ని, ఎఱ్ఱనౌకా దళాన్ని ఏర్పాటు చేయవలసిందిగా ఉత్తరువు లివ్వబడ్డవి. సోవియట్లు ఈ కొద్దికాలంలో సాధించగల్గిన కార్యక్రమంతో పోల్చిన మితవాదులకు చెందిన కాన్‌స్టిట్యూ ఎంట్ అసంబ్లి (ప్రజాప్రతినిధి పరిషత్తు) అప్పటికే నిరుపయోగమై పోయింది. అందువల్ల దానిని రద్దుపరచారు. జమీందారీ విధానం, కొన్ని జాతులను బానిసత్వంలో నుంచడం మొదలైన అలవాట్లన్నీ తొలగింప బడ్డవి. గొప్ప గొప్ప జమీన్లను సొంతానికి కల్గివున్న మతసంస్థల హక్కులన్నీ రద్దుచేయబడ్డవి. స్త్రీలకు పురుషులతోపాటు సమాన హక్కు లివ్వబడ్డవి. బ్యాంకులనూ, రైలు మార్గాలనూ, విదేశ వ్యాపారాన్నీ, వ్యాపార నౌకలనూ, పెద్ద పెద్ద వ్యాపార సంస్థ లన్నింటినీ జాతిపరం చేయడం మూలంగా పెట్టుబడిదారుల బలం వుడిగిపోయింది. విదేశాలనుంచి పుచ్చుకున్న ఋణాలనూ, విదేశాలకు పంపవలసిన చెల్లింపులనూ నిరాకరించడంవల్ల రష్యానుంచి విదేశపు పెట్టుబడిదారులు తరిమి వేయబడ్డారు. ఈ ప్రయత్నాలమూలంగా సోవియట్ల బలం దృఢపడ్డది. పెట్టుబడిదారులూ, భూస్వాములూ, అభివృద్ధి నిరోధకులైన ఉద్యోగులూ, విప్లవద్రోహులూ మొదలైనవారి బలం క్షీణించింది.

కాని, ఇంకా దోగాటలోనే ఉన్న సోవియట్ ప్రజాస్వామ్యం జర్మనీతో తాను యుద్ధంచేస్తూన్నంతకాలం క్షేమంగా నిర్మాణ కార్యక్రమానికి పూనుకోలేకపోయింది. ఈ పరిస్థితియొక్క సత్యాన్ని గుర్తెరిగి, ఆర్థికపతనం, యుద్ధాల అలసట, బలహీనమౌతూన్న యుద్ధరంగం, జర్మను సామ్రాజ్యవాదుల కుట్రలు మొదలైన వాటి నిజస్వరూపాన్ని చూచి, ప్రపంచమంతటనూ ప్రజాస్వామ్య శాంతిని నెలకొల్పను, ముందు అన్నిరంగాలలోను యుద్ధం ఆపబడాలని సోవియట్లు కోరినవి. మిత్రరాజ్యాల ప్రభుత్వాలిందు కంగీకరించలేదు. అందువలన సోవియట్లు జర్మనీతో ప్రత్యేక సంధి కుదుర్చుకోను బ్రెస్ట్ – లిటొవ్‌స్కు వద్ద విరామ పత్రాన్ని, జర్మనీతో, సంతకం చేశాయి. జర్మనీ అతి భారమైన షరతులను వుపపాదించినా, కేంద్రసమితి పేర లెనిన్, స్టాలిన్‌లు రాజీచేసుకోవలసిందనే పట్టు పట్టారు. కాని, ట్రాట్స్కీ, శాంతి కుదర్చను ఏర్పరుపబడిన రాయబారానికి అధ్యక్షుడు గనుక, జర్మనీ షరుతులకు అంగీకరించలేదు. పైగా, జర్మనీతో సోవియట్ సంయుక్త రాష్ట్రం తన సైన్యాన్ని రద్దుచేస్తుందని చెప్పాడు.

జర్మనీ త్వరలోనే "యుద్ధ విరామం" పూర్తి అయినదని ప్రకటించింది. యుద్ధాన్ని మరల ప్రారంభించింది. సోవియట్‌దేశంలో కొంత విశాల భాగాన్ని ఆక్రమించింది. కాని, జర్మను సామ్రాజ్యవాదులు ఈవిధంగా మోసగించి తమ దేశంతో కలుగజేసుకోడంవల్ల సోవియట్ ప్రజానీకం చెలరేగింది. "సామ్యవాద పితృభూమికి అపాయం కలుగుతూంది ! జాగ్రత్త !" అన్న నినాదాలతో సోవియట్ ప్రజలందరూ ఒక్కమారు విజృంభించారు. ఫ్రెంచి విప్లవంరోజుల్లో (1789) కార్‌నాట్, అతని సహచరులు చేసినట్లు, సోవియట్ ప్రభుత్వం ఎర్రసైన్యాన్ని నిర్మించింది. ఈ సైన్యం సామ్రాజ్యవాదుల ఆశలను భగ్నంచేసింది. 18-2-1918 న కేంద్ర సమితి, లెనిన్ సలహాల నంగీకరించి జర్మను ప్రభుత్వానికి వెంటనే యుద్ధ విరామాని కేర్పాటుచేయమని కోరుతూ, తంతి నంపింది. జర్మను ప్రభుత్వం తన కెక్కువ లాభకరమైన షరతులను సోవియట్లనుండి గుంజుదామన్న ఉద్దేశంతో కొంత తాత్సారం చేసింది. 22 ఫిబ్రువరిన జర్మనీ — సోవియట్లు షరతులను కుదుర్చుకున్నవి. శాంతినిగురించి, నిష్కర్షగా, తీర్మానించడానికని సమావేశమైన 7 వ కమ్యూనిస్ట్‌పార్టీ కాంగ్రెసులో లెనిన్ ఇలాన్నాడు—

> "మన పార్టీలో, మనకే విరుద్ధంగా నేర్పడిన అతివాదుల శాఖ ఫలితంగా ప్రస్తుతం మన పార్టీ లోనుగావలసివచ్చిన క్లిష్టత రష్యను విప్లవం అనుభవించిన అంత్యంత కష్టాల్లో ఒకటి."

శాంతిని సాధించి, ధనికవర్గాన్ని, వారి ప్రభుత్వ విధానాన్ని ధ్వంసంచేసిన తర్వాత తాము పొందిన జయాన్ని స్థిరపరచను, విచ్ఛిన్నమైపోయిన దేశాన్ని మరల నిర్మించను సోవియట్లు పూనుకున్నాయి. శ్రామికవర్గం అధికారానికి రావడం ప్రపంచంలో ఇదే మొదటిసారి. అందువలన శ్రామికవర్గం, బోల్షివిక్ పార్టీగూడా కొత్తగా ప్రభుత్వ విధానాన్ని నేర్చుకోవలసి వచ్చింది. అప్పటి పరిస్థితుల అన్నింటినీ గుర్తుంచుకొని, లెనిన్, తన ఉద్గ్రంథం "సోవియట్ ప్రభుత్వం నెరవేర్చవలసిన అత్యవసర కార్యాలు"లో సామ్యవాద నిర్మాణ సమస్య లన్నిటినిగురించి విశదంగా చర్చించాడు. ఉత్పత్తి అంతయూ లెక్కింప బడవలెననీ, పంపకవిధానం మీద ప్రభుత్వం సర్వాధికారం కలిగి ఉండాలనీ లెనిన్ ఉపపాదించాడు. నగరాల్లోని, గ్రామాల్లోని లక్షలాది కొద్దిపాటి ఆస్థిపరులు ఇట్టి కట్టుబాట్లకు, క్రమతకు

విముఖులుగా నుండడం సహజం. అందువల్ల కొంత ఒత్తిడి తేవలసి వచ్చింది. శ్రమపడడంలో కొందరు ఒళ్ళు దాచుకోడం, పరిశ్రమలలో శ్రామిక కట్టుబాట్లు లేకుండడం చూచి కమ్యూనిస్ట్‌పార్టీ ఈ లోటులను రూపుమాప పూనుకుంది. "నేర్పరితనం—చురుకుదనం"—ఈ రెండు పదాలు కమ్యూనిస్ట్‌పార్టీ తొలిపదాలైనవి. ఈ పదాలను కమ్యూనిస్టులు జపించ నారంభించారు. పరిశ్రమలలో సామ్యవాదపు పోటీ, ప్రతి పనిలోని భాగానికి - కూలీ రేటు ప్రత్యేకంగా నుండడం, మొదలైన మార్పు లవసరమని లెనిన్ పట్టుపట్టాడు. కొంధరు, కేవలం ఊహాప్రపంచంలో నుండడంవల్ల కూలీ ప్రతి ఒక్కరికి సమానంగా ఇచ్చినప్పుడే సామ్యవాద మేర్పడుతుందని లేకుంటే లేదని వాదించారు. వారికి విరుద్ధంగా కూలీ—సమానత్వం కూడదని లెనిన్ పోరాడాడు.

తర్వాత అత్యవసరమైన కార్యం గ్రామాలను క్రమజీవితానికి తీసుకొనిరావడం. కూలక్కుల (కొద్దిపాటి భూకామందులు - వీరు రైతులేకాని తాము కాయకష్టం చేయకుండా కూలీలచేత చాకిరంతా చేయించి తాము సుఖమనుభవిస్తారు) బలం హెచ్చుతూ ఉంది. జమీందారులనుంచి ప్రజలు వశపరచుకున్న భూములను వీరు స్వాధీన పరచుకో నారంభించారు. పైగా వీరు శ్రామికవర్గ ప్రభుత్వానికి ధాన్యాన్ని నిర్ణయింపబడ్డ ధరకు అమ్మను నిరాకరించారు. అందువలన నగరాలనుంచి శ్రామికులు, ముఠాలు ముఠాలుగా గ్రామాలకు వెళ్ళారు. పేదరైతులను ఒక కట్టుబాటుకుతెచ్చి కూలక్కుల బారినుంచి వారిని తప్పించ ప్రయత్నించారు. ఆహార పదార్థాలమీద నియంతృత్వాన్ని ఏర్పాటుచేస్తూ ప్రభుత్వం అనేక ఉత్తర్వులను శాసించింది. 11-6-1918 న పేదరైతుల సభలు ఏర్పాటు చేయబడ్డవి. జమీందారులనుంచి ప్రభుత్వము, శ్రామికవర్గము వశపరచుకున్న భూమినీ, వ్యవసాయపు పనిముట్లనూ ఈ సభలు మరల పంచినవి.

పై కార్యక్రమాన్నంతటినీ సాగించడంలో "అతివాద కమ్యూనిస్టు"ల వ్యతిరేకత తప్పిందికాదు. వారు ఈ ప్రయత్నాలన్నీ చాలవని, ఇంకా తీవ్రమైన మార్పులు తేబడవలయునని వాదించారు. కాని, అప్పటి పరిస్థితుల నెదుర్కొనను ఈ ప్రయత్నాలే ఉత్తమోత్తమ మైనవని కమ్యూనిస్ట్‌పార్టీ గ్రహించి, పార్టీమొత్తం ఈ ప్రయత్నాల నమలునందుంచను తోడ్పడినది.

లక్షలాది శ్రామికులు నూతన సామ్యవాద ప్రపంచానికి పునాదులు వేయను ముందుకు సాగుతుంటే పెట్టుబడిదారి ప్రభుత్వాలు, అభివృద్ధి నిరోధకులు ఊరు కున్నారుగారు. "కమ్యూనిజం" అన్న మాటకే భయపడి పెట్టుబడిదారి ప్రభుత్వాలు, వాటి బలగంతో లేవయస్సులోనున్న సోవియట్ ప్రజాస్వామ్యాన్ని ధ్వంసం చేయను ప్రయత్నించినవి. విప్లవ ప్రభుత్వం విదేశ అభివృద్ధినిరోధక ప్రభుత్వాల సాయుధ సైన్యములచేత ఎదుర్కొన బడిన నిదర్శనా లితరం చాలానే ఉన్నాయి. స్పెయిన్ ప్రభుత్వం (1937) రెండు ఫాసిస్టు ప్రభుత్వాల సాయుధ సైన్యాలు తమ దేశ వ్యవహారాల్లో జోక్యం పుచ్చుకోడాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ ఫాసిస్టు ప్రభుత్వాలకు (జర్మనీ, ఇటలీ) సామ్రాజ్యవాద ప్రభుత్వాలన్నీ, బహిరంగంగా గాకున్నా, ఈ జోక్యంలో సాయపడ్డవి. ఫ్రెంచి విప్లవం (1789) యూరప్‌లోని అప్పటి ముఖ్యమైన ప్రభుత్వాల సంయోగాన్ని అనేకమార్లు ఎదుర్కొవలసి వచ్చింది. సోవియట్ విప్లవం (1917) మూడేండ్ల పర్యంతం పెట్టుబడిదారి ప్రపంచ మంతటి సాయుధ సైన్యాలను ఎదుర్కొవలసి వచ్చింది.

జోక్యం - అంతర్యుద్ధం ఆరంభంలో, ప్రపంచ యుద్ధం (1914-18) లో పాల్గొంటున్న యిరుకక్షీలవారూ, ఒకవైపు జర్మనీ - జర్మనీ మిత్రులూ, మరో వైపు ఫ్రెంచివారు - బ్రిటిష్‌వారు - అమెరికన్లూ, బోల్షివిజాన్ని నాశనంచేయనో లేక బలహీనపరచనో దూరంనుంచి సహాయంచేస్తూ ఉన్నారు. రష్యాలోని పడమటి రాజ్యాలు జర్మను సామ్రాజ్యవాదుల వశమైనవి గనుక అందలి బాల్టిక్ ప్రభువులకు - వీరిలో పేరు, ప్రఖ్యాతులను పొందిన నీచుడు, వీరికి మంచి నమూనా మెన్నర్‌హీమ్ ప్రభువు - సామ్యవాద ప్రయత్నాల నణచను సంపూర్ణ అధికార మివ్వబడ్డది. పారిశ్రామికంగాను, కీలక స్థానంగాను అత్యంత ప్రాధాన్యతగల ట్రాన్స్ - కకేషియా సోవియట్ రష్యానుంచి వేరుపరుపబడ్డది. జార్జియా, అజర్ బెయిడ్ జాన్‌లకు, అచ్చటి "జాతీయవాదులు" వేడుకోలుమీద జర్మనీ, టర్కీ సైన్యములు పంపబడ్డవి. సోవియట్ ప్రభుత్వంమీదికి డాన్ ప్రాంతంలో తిరుగుబాటును లేవదీసిన జనరల్ క్రాస్‌నోవ్‌కు జర్మను ప్రభుత్వం ఆయుధసామగ్రిని పంపింది.

ఉత్తరాన బ్రిటిష్‌వారు, ఫ్రెంచివారు తమ సేనలను దింపారు. ఆర్చేంజల్, మర్మన్‌స్క్‌లను ఆక్రమించారు. తెల్లభటుల తిరుగుబాటుకు సాయపడ్డారు.

అచ్చటి సోవియట్లను ధ్వంసంచేసి "తెల్లరష్యా ప్రభుత్వం" అన్నపేర తెల్లభటుల ప్రభుత్వా న్నొకదానిని ప్రతిష్ఠించారు. జపాన్‌వారు వ్లాడివోస్టక్‌లో తమ సైన్యాల దింపి, తిరుగుబాటుదారులైన తెల్ల భటులకు సాయపడి పెట్టుబడిదారి విధానాన్ని అచ్చట పునఃప్రతిష్ఠించారు. ఉత్తర కాకసస్‌లో బ్రిటిష్, ఫ్రెంచివారల సహాయంతో జనరల్ గోర్నిలోవ్, జనరల్ అలెక్స్యేవ్, జనరల్ డెనికిన్లు కలసి విప్లవ విరుద్ధ సైన్యాన్ని సమకూర్చి సోవియట్లపైకి దాడికి పూనుకున్నారు.

మధ్య ఓల్గా ప్రాంతంలోను, సైబీరియాలోను బ్రిటన్లు, ఫ్రెంచివారు సోవియట్లమీదికి తిరుగబడమని జెకొస్లోవేకియా సైనికులను పురిగొల్పారు. ఈ "నాగరికులు" అయిన రాక్షసదండుల నెదిరి సోవియట్ ప్రభుత్వం ఏంచేయగలదు? అప్పట్లో రష్యాలో ఆర్థిక క్లిష్టత ఏర్పడింది. ముడివస్తువులు, చమురు, నేలగొగ్గు లేకపోవడంచేత ఫాక్టరీలు ఆగిపోయాయి. రొట్టె, మాంసం అరుదైంది. అనుభవంగల విప్లవసైన్యంలేదు. కాని శ్రామికవర్గం స్థైర్యాన్ని వదలిందిగాదు. "సామ్యవాద పితృభూమి"ని నిలబెట్టను అవసరమైన త్యాగం చేయను పూనుకుంది.

అంధకార శక్తులను పారదోలను, అనాగరిక ప్రపంచానికి బుద్ధిగరపను సోవియట్ ప్రభుత్వం తన దేశంయొక్క ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ జీవితాన్ని సమీకరించింది. యుద్ధరంగానికి వేనవేలు స్వచ్ఛంద సేవకులు వెళ్ళారు. ఎర్రసైన్యం ఏర్పాటు చేయబడింది. కమ్యూనిస్టు కమ్మిసార్లు (సలహాదార్లు) ఎర్ర సైన్యానికి రాజకీయ విద్యను గరపినారు. ఎర్రసైన్యపు కట్టుబాట్లను, క్రమపద్ధతిని అభివృద్ధి పరచారు. ఫలితాలు త్వరలోనే స్పష్టమైనవి. ఉత్తర కాకసస్‌లో జనరల్ డెనికిన్ ఆపబడ్డాడు. మాస్కోలోని బ్రిటిష్ రాయబారానికి నాయకుడైన లాఖార్టు, యరొస్లోవాలో తిరుగుబాటును లేవదీశాడు. ఈ తిరుగుబాటు అణచివేయబడింది. నీచాతి నీచుడైన జనరల్ కొర్నిలోవ్ ఎర్రసైన్యాన్ని ఎదుర్కొనినప్పుడు చంపబడ్డాడు.

కాని, ఎక్కువ కష్టకాలాలు, శల్య పరీక్షలు, అతి ఘోరమైన యుద్ధాలు ఇంకా ముందురానున్నాయని సోవియట్ ప్రభుత్వం తెలుసుకుంది. ఈ అనివార్యమైన కష్టాలను ఎదుర్కొడానికి సోవియట్లు తగిన ప్రయత్నంలో నుండగా జర్మనీ, ఆస్ట్రియాలలో మహత్తరమైన మార్పులు కల్గుతూ ఉన్నాయి. ఈ దేశాలప్రజలు ఆహారపదార్థాలు దొరక్క గొప్ప క్షామంలో వున్నారు - పైగా వీరిపై అద్దు, అపు

లేని యుద్ధం సాగుతునే ఉంది. వీటన్నిటికి తోడు అక్టోబరు విప్లవప్రభావం జర్మనీ, ఆస్ట్రియాలలోని సైనికులలోను, శ్రామికులలోను వ్యాపింప నారంభించింది. అందువల్ల 1918 నవంబరులో జర్మనీలో విప్లవం ప్రారంభమైంది. కైజర్ (రెండవ విల్హెల్మ్) అతని ప్రభుత్వం అధికారాన్నుంచి తొలగించ బడ్డారు. యూరప్‌లో వీచుచున్న విప్లవ జ్వాలల ఫలితంగా సోవియట్ ప్రభుత్వానికి కొన్నిలాభాలు కలిగాయి కాని నానాటికి ఎక్కువౌతూన్న పెట్టుబడిదారి ప్రభుత్వాల - మిత్రమండలి రాజ్యాల జోక్యాన్ని తానొంటరిగా ఎదుర్కొనవలసి వచ్చింది.

ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధంలో (1914-18) జర్మనీ ఓడిపోగానే యుక్రేన్, ట్రాన్స్ - కకేషియాలలోనున్న జర్మను దళాలు మాతృదేశానికి పిలువబడ్డవి. తమ సామ్రాజ్యవాద విరోధుల నోడించిన తర్వాత, జర్మను సైన్యాలు ఖాళీ చేసిన యుక్రేను, ట్రాన్స్ - కకేషియాల నాక్రమించను బ్రిటన్, ఫ్రాన్సులు తమ సైన్యాల నంపినవి. తమ నౌకా బలాన్ని నల్ల సముద్రానికంపి ఒడెస్సాలో తమ సేనల దింపినవి. రష్యాకు తినుటకు లేకుండాచేసి లొంగదీయను, ఆఖరుకు, బ్రిటన్, ఫ్రాన్సులు రష్యా పై "బహిష్కరణ"ను ప్రకటించినవి. మిత్రమండలి రాజ్యాలు సైబీరియాలోని ఒమ్స్కులోనున్న అడ్మిరల్ కోల్‌ఛక్‌కు - అతను వీరి చేతి కీలుబొమ్మ - సహాయంచేయడానికి ఎత్తులు పన్నినవి. కోల్‌ఛక్‌ను "రష్యా సుప్రసిద్ధ పరిపాలకుడు" అని ప్రకటించినవి. కోల్‌ఛక్ సైన్యాలు ముందుకుసాగ నారంభించినవి. బోల్షివిక్కులు తమ మేటి సేనలను కోల్‌ఛక్ నెదుర్కొనను పంపారు. అతని వెనుక గొరిల్లా దళాల నేర్పాటుచేశారు. అందువలన కోల్‌ఛక్ ఓడిపోక తప్పిందికాదు. పాశ్చాత్య సామ్రాజ్యవాదులు ఓడిపోతున్న కోల్‌ఛక్‌ను రక్షించను సోవియట్ సేనల దృష్టిని మరోవైపుకు ఆకర్షించవలసి వచ్చింది. జనరల్ యుడెనిక్ సహాయంతో పెట్రొగ్రాడ్‌మీదికి పాశ్చాత్య సామ్రాజ్యవాదులు దాడి నంపారు. కాని ధీరులైన సైనికులు, శ్రామికులు తమ నగరరాజమును రక్షించుకోగల్గారు. ఈ జోక్యదారులు అప్పటికైనా ఆశల వదలాడుకారు. తమ ప్రయత్నా లన్నింటినీ దక్షిణ రంగంలో కేంద్రీకరించారు. ఇచ్చట వారి బంటు డెనికిన్. ఈతడు 1918 అక్టోబరులో యుక్రేనును ఆక్రమించుకున్నాడు. మాస్కో నగరానికి అపాయం కలిగేటట్లుంది. "డెనికిన్‌ను నాశనంచేయను అందరు సిద్ధం కావాలి" అన్న నినాదాన్ని లేవదీశాడు లెనిన్. కమ్యూనిస్ట్‌పార్టీ కేంద్రసమితి డెని

కిన్ పైకి స్టాలిన్, వొరొషిలావ్, అర్డ్జోనికిడ్జ్, బుడెన్నీలను దక్షిణరంగానికి పంపింది. స్టాలిన్ నాయకత్వాన ధీరులైన శ్రామికులు, సైనికులు ఒక్క పెట్టున చెలరేగారు. కమ్యూనిస్టులు ముందు నడచారు. ఘోర యుద్ధాలు సాగాయి. జనరల్ డెనికిన్ సైన్యాలువచ్చిన దారినిపట్టాయి.

ఈవిధంగా సామ్రాజ్యవాదులు తాము జోక్యం పుచ్చుకున్నందుకు ఓడిపోవడమేగాక బాల్యంలోనున్న సోవియట్లను రూపుమాప ప్రయత్నించుచున్నందుకు వారి ప్రయత్నాలను ఖండించుచూ వారి దేశాల్లోని శ్రామికులు ప్రదర్శించిన అసమ్మతికిగూడ గురి అయినారు. ఈ శ్రామిక ప్రదర్శనాలన్నిటిలోకి ముఖ్యమైనది 1920 జనవరిలో అంద్రేమార్టే నాయకత్వాన ఒడెస్సాలో ఫ్రెంచి నౌకాదళం జరిపిన ప్రదర్శనం. ఇందువలన పెట్టుబడిదారి ప్రభుత్వాలు "బహిష్కరణ"ను రద్దుచేయవలసివచ్చింది. సోవియట్ సంయుక్త రాష్ట్రానికి ఊపిరి త్రిప్పుకోను సమయం దొరికింది.

కాని పాశ్చాత్య సామ్రాజ్యవాదులు సామ్యవాద పరిపాలన ఒకటి ప్రపంచంలో నుండడాన్ని సహించలేక పోయారు. రష్యాలో ప్రభుత్వానికి విరుద్ధంగా గూఢచారుల నేర్పాటుచేయనూ, ఉత్పత్తి సాధనాలకు, రాకపోకల వసతులకు భంగం కల్గించనూ, సోవియట్ ప్రభుత్వంమీదికి ప్రజలను ఉసిగొల్పనూ, సైనిక ప్రయత్నాలు చాలక బ్రిటిష్ సామ్రాజ్యవాదులు రూ. 150,00,00,000 ఖర్చు పెట్టారు. సోవియట్ సరిహద్దుల దండెత్తను అంత్యప్రయత్నం మరొకటి చేశారు. కొత్తగా ఏర్పరచబడిన పోలండుదేశానికి నాయకుడైన మార్షల్ జోసఫ్ పిల్‌సూడ్‌స్కీ ఈమారు వారి బంటుగా ఏర్పడ్డాడు. 1920 ఏప్రిల్‌లో పోలండు సైన్యాలు కీవ్ నగరాన్ని వశపరచుకొని జయప్రదంగా ముందుకు సాగాయి. ఎర్రసైన్యం పోలండు సైన్యాల నెదుర్కొని, వాటిని మరలించడమేగాకుండా, వార్సా పొలిమేరల వరకు తరిమాయి. బ్రిటన్, ఫ్రాన్సులు జాగ్రత్తపడి వెంటనే తమచేతి కీలుబొమ్మ అయిన పోలండుకు సహాయంగా సైన్యాల నంపినవి. ఎర్రసైన్యం ఓడిపోయింది. ఎర్రసైన్యాన్ని వెంటబడి వేటాడాలని సామ్రాజ్యవాదులు ప్రయత్నించారు గాని వీలుగా లేదు. ఇందుకనేక ఆటంకాలేర్పడినవి. వాటిలో ముఖ్యమైనది 1920 లో బ్రిటిష్ శ్రామికవర్గం సోవియట్ రష్యామీది యుద్ధాన్ని ఆపను "కార్య సమితులు" నిర్మించడమే. పిదప విప్లవద్రోహులలో కడపటివాడైన జనరల్ రంగెల్

ఓడింప బడ్డాడు : ఈతనిసైన్యం అపార నష్టంబొందింది. అప్పటినుంచి ట్రాన్స్ - కకేషియా, అజర్‌బెయిడ్జాన్, జార్జియా, అర్మీనియాల విముక్తి ఆరంభమైనది.

జపాన్, తన జోక్యాన్ని 1922 వరకు సాగించినా ఈ జోక్యానికి కారణమైన ప్రధానశక్తులు 1920 ఆఖరుకల్లా నాశనంచేయబడినవి. అన్ని రంగాల్లోను సోవియట్ ప్రజాస్వామ్యం జయం పొందింది.

సైనికులు తామెందుకు పోరాడుచున్నారో గ్రహించారు గనుకనూ, వారు క్రమ శిక్షణను బొంది కట్టుబాట్లలో నున్నారు గనుకనూ, అసమాన త్యాగానికీ, సాహసానికీ పూనుకున్నారు గనుకనూ ఎర్రసైన్యం జయించగల్గింది. ఎర్రసైన్య విజయానికి కారణాలు (1) యుద్ధాల్లో ఉక్కులాగా గట్టిబడి, శక్తిలో విప్లవోత్సాహం గల్గిన బోల్షివిక్ పార్టీ కోట్ల జనాన్ని అపరిమిత కష్టాల్లో ముందుకు నడిపించడమేగాక రాజకీయంగా వారికి విద్యగరప మొదలుపెట్టడమూ; (2) విప్లవ ద్రోహుల సేనలవెనుక ప్రజలు ఆ ద్రోహులపై తిరగబడడమూ; (3) అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతయు; (4) వీటన్నిటికన్నను మిన్నగా, యుద్ధరంగమందలి అవసరాలను తీర్చను జాతీయ జీవితమంతా సమీకరించబడడమూను.

యుద్ధరంగానికి కావలసిన సరఫరాలను పంపునిమిత్తం దేశాన్ని సమీకరించనూ, ఏకోన్ముఖంగా దేశమంతా యుద్ధసన్నాహంలో నుండనూ అవలంబింపబడ్డ ఆర్థిక ప్రయత్నాలన్నిటినీ కలిపి "యుద్ధ – కమ్యూనిజం" అని అంటారు. జారు ప్రభుత్వంనుంచి సంక్రమించి, కూలిపోవుచున్న పరిశ్రమలనూ, వ్యవసాయాన్నీ నిలబెట్టను సోవియట్ అధికారులు ఏ ఏ ప్రయత్నాలు చేశారని ముందే గమనించాం. కాని అంతర్యుద్ధం, జోక్యంతో ఆ విధానమంతా మార్పు చెందవలసి వచ్చింది. ఆరంభంలో రైతులకూ, శ్రామికులకూ జరిగిన ఒడంబడికనుబట్టి రైతులు భూమిని ఉపయోగించుకోవచ్చు. శ్రామికులు తమ పరిశ్రమల ఉత్పత్తి ఫలితాలను రైతులు పండించిన పంటతో మారకం చేసుకునేవారు. కాని యుద్ధ అవసరాల ననుసరించి ఈ ఒడంబడిక నుల్లంఘించవలసి వచ్చింది. అందువలన, పంటలుమాత్రమేగాక భార పరిశ్రమల ఫలితాలన్నిటినిగూడా ఎర్రసైన్య అవసరాల కంపవలసి వచ్చింది. రైతులు తమ కుటుంబ అవసరాలకుపోగా మిగిలిన పంట నంతటినీ ప్రభుత్వానికి అప్పగించవలసి వచ్చింది. సొంతవ్యాపారం నిష్కర్షగా నిషేధింపబడ్డది. 1918 లో, సోవియట్ ప్రభుత్వం అనుకున్నంతకన్నా

ఎక్కువగా, కొద్దిపాటి వర్తకుల వ్యాపారంగూడా జాతీయం చేయబడ్డది. ఆఖరుకు, "సర్వజన శ్రామిక సేవ" అందరికి అన్వయించేటట్లు ప్రవేశపెట్టబడ్డది. "పనిచేయని వాడు పస్తుండాలసిందే" అన్న సిద్ధాతం ఆచరణలోకి తేబడ్డది.

అంతర్యుద్ధంలోనూ, జోక్యంలోనూ సోవియట్లు విజయం పొందినవిగాని ఈ విజయాన్ని సాధించను అపార నష్టాన్నిగూడ పొందవలసి వచ్చింది. దేశం యొక్క ఆర్థిక జీవనం 6 ఏండ్ల (1917-23) బీభత్సంవల్ల నాశనమైంది. ఉత్పత్తి సాధనాలు పరిశ్రమలనుండి లాగివేయబడి సైన్యోపయోగానికి ఉపయోగించబడ్డవి. బొగ్గూ, చమురూ మొదలైన యంత్రాలను నడుపు సామగ్రి, ముడివస్తువులలోటు హెచ్చింది. ఏదో కొంత ముడివస్తువులు దొరికినా రాకపోకల వసతులు లేనందున ఆ వస్తువులు ఉన్నచోటనే చెడిపోనారంభించినవి. 1923 లో సాగిన ఉత్పత్తిని యుద్ధానికి పూర్వం (1913) జరిగిన ఉత్పత్తితో పోల్చిన కేవలం 7 వ పాలు మాత్రమే 1923 లో జరిగింది. కేవలం జీవిత అవసరాలైన రొట్టె, మాంసం, బట్టలుకూడా దుర్లభమై పోయినవి. జారులకాలంనుంచి అతి పేదరికంలో కృశిస్తూన్న రైతులుగూడ ఈ కరువుకు లోనై బాధలు పడ్డారు. 1920 లో పంటలు సరిగా పండనందున వ్యవసాయ ఫలితం మరీ క్షీణించింది.

యుద్ధం సాగుతూన్నంతవరకు ప్రజా బాహుళ్యం అష్ట కష్టాలను సహనంతో అనుభవించింది. కాని, శాంతి ఏర్పడగానే పూర్వపు పరిస్థితులేర్పడాలని ప్రజలు కోరారు. వీరిలో ముఖ్యులు రైతులు. జాతీయ రక్షణయొక్క ప్రాధాన్యతను గుర్తించి తాము పండించిన పంటలో తమకుటుంబ జీవనానికిపోగా మిగత అంతా ప్రభుత్వం తీసుకున్నా రైతులు ఓర్చుకున్నారు. ప్రభుత్వం వారిని జమీందారుల, కూలక్కుల వాత బడకుండా రక్షిస్తుందని నమ్మారు. శాంతి ఏర్పడింది గనుకనూ, భూస్వాములు, కూలక్కులు రూపుమాప బడ్డారు గనుకనూ రైతులు తమ అదనపుపంటనంతను ప్రభుత్వానికివ్వను సమ్మతించారుకారు. దుర్భరమైన పరిస్థితులలో జీవించడం వలన శ్రామికులలోగూడ అసంతృప్తి వ్యాపించింది. పైగా, పరిశ్రమలనేకం ఆగిపోయినందున శ్రామికులు నిరుద్యోగులు కానారంభించారు: తమవర్గ చైతన్యాన్ని కోల్పోతున్నారు. శ్రామికవర్గ ప్రభుత్వం వారిచైతన్యంమీద ఆధారపడివుంది గనుక శ్రామికులు నిరుద్యోగులై, తమవర్గ చైతన్యాన్ని గోల్పోవడంవల్ల, ముస్ముందు, ప్రభుత్వానికే మోసము వచ్చేటట్లు కనబడ్డది.

చాలాకాలం చర్చ సాగినతర్వాత బోల్షివిక్ పార్టీ కేంద్ర సమితి, పరిస్థితు లలో మార్పు ఏర్పడింది గనుక "యుద్ధ – కమ్యూనిజం" బదులు "నూతన ఆర్థిక విధానం" అవలంబింపబడవలెనని, తీర్మానించింది. రైతులనుండి అదనపు పంటను తీసుకోడం మానివేసి అందుకు బదులుగా కొద్దిపాటి పన్నును విధింప నారంభించారు. రైతు, తనచేత మిగిలిన అదనపు పంటను బజార్లో అమ్ముకొనవచ్చును. పట్టణాల్లోని సొంత వ్యాపారస్థులు, సొంతగా ఉత్పత్తిచేసెవారు వ్యాపారాన్ని సాగించను అనుమతిని పొందారు. ఈ ఆర్థిక ప్రేరకం కారణంగా పరిశ్రమలూ, వ్యవసాయమూ పునరభివృద్ధి చెందినవి. శ్రామికులు, రైతుల మధ్య సఖ్యత హెచ్చింది. కొంతవరకు పెట్టుబడిదారి విధానాని కవకాశమిచ్చినదన్నమాట నిజమే, కాని (ఈ ఆర్థిక ప్రేరకాలు) దేశంయొక్క ఆర్థిక జీవితంలోని కీలక స్థానాలన్నీ సోవియట్ ప్రభుత్వంచేతిలోనే ఉండిపోయాయి. బ్యాంకులు, విదేశవ్యాపారం, భారపరిశ్రమలు, రైలు మార్గాలు, జాతిపరం చేయబడ్డ భూమి, ఎర్రసైన్యం, నౌకాదళం - ఇవన్నీగూడా రాష్ట్రం చేతుల్లోనే ఉన్నాయి. ఈ పరిస్థితుల్లో కొద్దిపాటి ఉత్పత్తి, వ్యాపారం పునరుద్ధరింపబడి, గ్రామాలు - పట్టణాలు మధ్య మారకం సాగితే సోవియట్ రాష్ట్రానికి మేలేకాని వేరుకాదు. సోవియట్ సంయుక్త రాష్ట్రంలో మరల పెట్టుబడిదారి విధానాన్ని స్థాపించడమన్న మాట లేనే లేదు.

రష్యా సామ్యవాదరూపాన అభివృద్ధి చెందడం సంభవమని నమ్మలేక ట్రాట్స్కీ, బుఖారిన్, కమనేవ్ మొదలైనవారు పెట్టుబడిదారులకు (దేశీయ - విదేశీయ) యెక్కువ సౌకర్యాలు కలుగజేయవలసిందిగా కోరారు. ఇతరులు, "నూతన ఆర్థిక విధానం" పాత పెట్టుబడిదారి విధానాన్ని పునఃప్రతిష్ఠించడం తప్ప వేరుకాదని, పెట్టుబడిదారులకేలాంటి సౌకర్యాలుండగూడదని వాదించారు. ఈ రెండు మతాలవారు ఊహాప్రపంచపు విప్లవకారులు, వీరందరు "నూతన ఆర్థిక విధానం" తిరోగమనం తప్ప వేరుకాదన్నారు.

ఒకవిధంగా "నూతన ఆర్థిక విధానం" తిరోగమనమే. కాని, ఓడిపోయిన సైన్యంయొక్క తిరోగమనంలాంటిది కాదిది, తన మూలస్థానానికి దూరంగా చాల ముందుకు పురోగమనాన్ని సాగించిన జయప్రదమైన సైన్యం, తాను తనమూల స్థానాన్నుంచి చాలదూరంలోనుండడాన్ని గమనించి కాస్త వెనక్కురావడంవంటిది. "నూతన ఆర్థికవిధానం" సరి అయినది - కానిది ఆది అమలులోనికివచ్చిన మొదటి

సంవత్సరంలోనే తేలింది. శ్రామికుల, రైతుల మధ్య సఖ్యత బలపడింది. కూలకుల్కులు రూపుమాప బడ్డారు. మధ్యతరగతి రైతులు సోవియట్ ప్రభుత్వానికి సాయపడ్డారు. పరిశ్రమలు, వ్యవసాయం పునరుద్ధరింపబడినందున బ్యాంకులు, భూమి, రైలుమార్గాలు మొదలైన గొప్ప పరిశ్రమలలో తాను ఆక్రమించుకున్న కీలక స్థానాలలో తన అధికారాన్ని సోవియట్ ప్రభుత్వం స్థిరపరచుకోగల్గింది. శ్రామికులు, రైతులు తమ ప్రభుత్వం సరియైనదారినే నడుస్తూందని గ్రహించగల్గారు. ఈ విధంగా సామ్యవాద పునర్నిర్మాణంలో మరొక అడుగు ముందుకు వేయడానికి తగిన పునాదులు వేయబడ్డవి.

---



సోవియట్ ఆర్మీనియాలోని ఇరివన్ నగరంలోని విద్యార్థుల వసతిగృహం.



గొప్ప రష్యన్ రచయిత — అలెక్జాండర్ సర్గియెవిచ్ పుష్కిన్.

(1799—1837)

# 3. నూతన ప్రేరకములు

## (అనిల బొనర్జి)

పెట్టుబడిదారీ విధానపు ఫలితమునైన స్వలాభాపేక్ష, చేర్చిపెట్టడం, పై పోటీ మొదలైనవి మానవునికి స్వభావమై పోయినవి. అట్టి మానవుని స్వగౌరవము, సాంఘిక దృష్టిగల పౌరునిగా మార్చుటకు సోవియట్లు ప్రయత్నించినవి. ఈ ఆశయమును సాధించుటకై పెట్టుబడిదారీ ఆర్థిక విధానానికి కీలకమైన, లాభంకొరకు సాగింపబడే ఉత్పత్తివిధానాన్ని రూపు మాపినవి.

సోవియట్ సంయుక్తరాష్ట్రంలోని మానవుల జీవితంలో ఈ ఒక్క మార్పు ఎంతో తేడా కల్గించినది. రష్యనుల నీతిలోను, న్యాయశాస్త్రంలోను ముఖ్యమైన మార్పు లేర్పడినవి.

పెట్టుబడిదారీ విధానంలో భూమిపైనను, డబ్బుమీదను వ్యక్తిగత స్వామ్యమున్నదనీ, - వ్యక్తికి, లేక వ్యక్తుల సంఘములకు హక్కున్నదనీ ప్రభుత్వము హామీ నిచ్చుచున్నది. కూడబెట్టడం ముఖ్యమైన సద్గుణాల్లో ఒకటిగా భావింపబడుచున్నది. ఉత్పత్తికి ప్రేరకం, ఉత్పత్తిని క్రమపద్ధతిని సాగించు కీలకము - రెండునూ లాభమన్న దురాశయై యున్నవి.

సామ్యవాదం ఉత్పత్తి సాధనాలవ్యక్తిగత స్వామ్యాన్ని రూపుమాపినది. లాభం సంపాదించవలయునన్న ఏకైకదృష్టిగల ఉత్పత్తి విధానానికి బదులు ఉపయోగార్థమై ఉత్పత్తి సాగింపబడే నిర్ణీత ఆర్థికవిధానాన్ని సామ్యవాద మేర్పాటు చేసినది.

పెట్టుబడిదారీ దేశాల్లో వ్యాపారం కేవలం లాభంకొరకు సాగించబడుచున్నది. లాభంతో అమ్మడానికే వ్యక్తులు మొత్తంగా సరకులను కొంటున్నారు. మున్ముందు హెచ్చుధరల కమ్మవచ్చునన్న వ్యాపారదృష్టితో ప్రస్తుతం లాభదాయకంగా వస్తువులు కొంటున్నవారిని మెచ్చుకోడానికి బదులు సోవియట్ సంయుక్త రాష్ట్రం మారుబేరం చేస్తున్నారని దండించుచున్నది.

పెట్టుబడిదారీ దేశంలోని యజమానితన అందుబాటులోనున్న మార్గాల నన్నిటిని లాభసముపార్జనకై ఉపయోగించుచున్నాడు. దీనికి ఫలితముగా యజమానుల మధ్య అపరిమితమైన పోటీ ఏర్పడుచున్నది. తత్ఫలితముగా యజమానులందరూ కలిసి శ్రామికులను దోచుకుంటున్నారు. సామ్యవాద దేశంలో ఉత్పత్తిని క్రమపద్ధతిని సాగించే కీలకం లాభంకాదు గనుక, లాభమన్న దోపిడీ చట్టమూలంగా నిషేధింప బడడమేగాక కఠినముగా శిక్షింపబడుచున్నది. తనకుగాను శ్రమ పడుటకు ఏ వ్యక్తిగాని - వ్యక్తుల సంఘంగాని మరొక వ్యక్తిని నియోగించకూడదు. ఒకనికి లాభాన్ని సమకూర్చుటకు మరొకవ్యక్తి తన పనిముట్లనుగాని, తన శ్రమ శక్తిని గాని ఉపయోగించ కూడదు. ముడివస్తువులనుండి కొనుగోలు వస్తువులను ఉత్పత్తి చేయుటకుగూడ ఇతరుల శ్రమ శక్తి నుపయోగించరాదు.

ప్రతి వ్యక్తియొక్క స్వాతంత్ర్యము సంపూర్ణంగా అభివృద్ధి చెందడమే ముఖ్యాశయంగా గల సంఘాన్ని స్థాపించడమే సామ్యవాదంయొక్క ప్రయత్నం. ప్రతి వ్యక్తియు తాను తన సొంతానికై కష్టించే సంఘంలో, ఉత్పత్తికి మూలం పై పోటీయైన సంఘంలో, ఉత్పత్తికి ప్రేరకం లాభమయిన సంఘంలో పై ఆశయాన్ని సాధించుటకు వీల్లేదు. మానవుడు సంఘజీవి. మానవుడు నిజమైన సాంఘిక దృష్టిని పొందడానికి, కేవలం వ్యక్తిగతంగా తన్నుగురించి మాత్రమే గాకుండా - ఇదే పెట్టుబడిదారీ విధానంలో మానవులుచేస్తూన్నది - సంఘమంతటిని గురించిగూడ ఊహించడానికిని పాటుపడడానికిని మానవునికి నూతన ప్రేరకాలు కొన్నింటిని సమకూర్చాలి. సోవియట్ సంయుక్తరాష్ట్రంలోని పలువిధములైన కళలను, సాంఘిక సంస్థలను చర్చించేముందు, ప్రస్తుతపు ఆర్థిక విధానంయొక్క లోటుపాట్లను విశదీకరించి, పాత ప్రేరకాలు ఏవిధమైన లోటుపాట్లను కలిగియుండినవో చర్చించి, అవి ఎందువలన ఇప్పుడు - కొద్దిమంది భోగపరులకు తప్ప - ప్రజలకు నిరుపయోగమైనవో స్పష్టపరచుట అత్యవసరం. కళలూ, విజ్ఞానమూ పరిశ్రమలలోని సాహసాన్ని, ధైర్యాన్ని రేకెత్తించినవి. పిదప ఉత్పత్తిని అపరిమితముగా అభివృద్ధికి తేగల్గిన నూతన ప్రేరకాలను గురించి గమనించనగును.

పెట్టుబడిదారీ విధానంలో అసందిగ్ధత సహజమని చరిత్రయే ఋజువుపరచినది. పెట్టుబడిదారీ విధానం ఆర్థిక స్వాతంత్ర్యమనే భావంమీద ఆధారపడి పుట్టి

నది. కాని, ఈ నమ్మిక కేవలం అపోహయని ఇప్పటికి స్పష్టమైనది. మితిలేని పై పోటీ మానవుని అత్యంత సౌఖ్యానికి దారితీస్తుందని ఆ రోజుల్లో నమ్మారు.

మానవులందరూ సోదరులన్న భావం ప్రపంచమంతటా వ్యాపించియున్న 19 వ శతాబ్దారంభంలో ఆనాటి మేధావులందరూ మితిలేని పై పోటీద్వారానే మానవుల ఆర్థిక సుస్థితి ఏర్పడుతుందని ఊహించారు. వారి ఊహలన్నిటికిని పునాది "మితిలేని పోటీ." ఉత్పత్తి సాధనాల పెరుగుదలకన్నా జనాభా ఎక్కువ వేగంగా పెరుగుతుంది గనుక మానవుడు ఎక్కువమంది పిల్లలు గనడం మానవలయుననియు, లేకున్న మానవకోటి అంతయు అష్టదరిద్రంలో సదా కృశించి పోవలయుననియు మాల్థూస్ ఒక సిద్ధాంతాన్ని లేవదీశాడు. వాతావరణమూ, ప్రకృతి పరిస్థితులూ బలహీనమైన ప్రాణులను నాశనముచేసివేస్తవి గనుక, బలవంతులైన జీవులు మాత్రమే ప్రపంచంలో మిగులునని జంతుశాస్త్రవేత్త డార్విన్ ఒక న్యాయాన్ని స్థిరపరిచాడు. వ్యక్తుల పరస్పర పోరాటం. కారణంగా, క్రమేణా, ఐక్యతగల సంఘం ఏర్పడేటట్లు ప్రకృతి శక్తులే పనిచేస్తున్నవని ఆరోజుల్లోని మేధావులు నమ్మారు. ఈవిధంగా దయ, దాక్షిణ్యం లేని అమానుషపు పై పోటీ నొకవైపు సాగించుచూ ఆనాటి ప్రజలు మరొకవైపు మానవసౌభ్రాతృత్వంలో నమ్మకంగలిగి యుండేవారు.

పెట్టుబడిదారీ సమాజంలో ప్రపంచాన్ని నడిపే కీలకం "లాభం". ఉత్పత్తి సాధనాలను వ్యక్తులుగాని, వ్యక్తుల సంఘాలుగాని తమ సొంత సొమ్ముగా గలిగియున్నవి. ఈ ఉత్పత్తి సాధనాలు సొంతదార్లుగానివారిచే ఆ సొంతదార్లకు లాభం సంపాదించి పెట్టుటకు ఉపయోగింపబడుచున్నవి.

"లాభం పొందగలం" అన్న దృష్టియే ఉత్పత్తి సాధనాల ఉపయోగానికి కారణం. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి "లాభం" కేవలం ప్రేరకం మాత్రమే గాదు; ఉత్పత్తిని క్రమపద్ధతిని నడిపే కీలకంగూడాను. ఏ వస్తువులు ఉత్పత్తిచేయబడాలి? ఎంతెంత పరిమితికి వస్తువులు ఉత్పత్తిచేయ బడాలి? అని "లాభమే" నిర్ణయిస్తుంది. లాభాన్నిచ్చే వస్తువులు మాత్రమే ఉత్పత్తి చేయబడతవి.

ఉత్పత్తి "లాభం" అన్న సూదంటురాయి సాయంతో గిరాకీవైపుకు లాగబడుతుంది గనుక మానవున కత్యావశ్యకమైన వస్తువులు మాత్రమే ఉత్పత్తిచేయ

బడుననీ, తదితర మేమీ ఉత్పత్తి చేయబడవనీ పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించే వారి వాదన.

నిజంగా ప్రజల కేవస్తువు లెక్కువ అవసరమో ఆ వస్తువులు ఉత్పత్తిచేయ బడడం లేదు. అప్పుడప్పుడు ధనికుల కక్కరలేనివి, బీదలు కొనలేనివి అయిన వస్తు సముదాయాన్ని పెట్టుబడిదారీ విధానం ఉత్పత్తిచేస్తూంది; అందువలననే ఆ వస్తువులు నాశనంచేయబడుచున్నవి. పెట్టుబడిదారీ స్వభావాల్లో ఒకటి వస్తు సముదాయాన్ని "వృధా పుచ్చడం." ఈ వృధాపరచడం అనేక రూపాల సాగుతూన్నది — ఉత్పత్తిసాధనాల నెక్కువగా ఉపయోగించలేక పోవడం; దొరుకుచున్న శ్రామిక శక్తిని ఉపయోగించలేక పోవడమున్ను. దీని రూపమే నిరుద్యోగం.

పెట్టుబడిదారీ విధానం నిరుపయోగమైనదని ఒప్పుకునేవారుగూడ సామ్య వాదం కేవలం ఊహయేనని - గాలిలో మేడల కట్టడమని - వాదిస్తున్నారు. "లాభం" అన్నవ్యామోహాన్ని తొలగించినయెడల ఉత్పత్తి ఆగిపోతుందని వారి వాదన. మార్క్స్ తన సిద్ధాంతాన్ని "ఆర్థిక మానవుడు" (అనగా మానవుడు ప్రాథమికంగా ఆర్థిక జీవితానికే పాటుపడుచున్నాడని) అన్న భావంమీద ఆధార పరచినాడని ఖండించేవారే "లాభం" అన్న ప్రేరకాన్ని తీసివేస్తే మానవుడు మరి కష్టించడానికి ప్రేరక మేదీ ఉండదని వాదించేవారిలో మొదటివారు.

పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించేవారు ప్రపంచంలోని పనులన్నీగూడా "లాభం" అన్న వ్యామోహంవలననే జరుగుచున్నవని వాదిస్తున్నారు. చెమటగార్చి పనిజేసే శ్రామికులూ, కుర్చీలలో గూర్చొని చెమటగార్చే గుమాస్తాలూగూడా ముందెన్నడో ఉత్పత్తి సాధనాల సొంత దారత్వంలో తమకు భాగం వస్తుందనీ, అప్పుడు కష్టించకుండా ఆదాయం పొందడానికి తమకు హక్కు ఉంటుందన్న ఆశవల్ల ఇప్పుడు కష్టించుచున్నారని వీరి వాదన. వీరి వాదననుబట్టి భయంవల్లను, బలవంతంవల్లనుగాదు శ్రామికులు కష్టించడం - ముందు లక్షలు కుప్పలుపోయ గలమన్న ఆశవల్లనే. శ్రామికులు తగినంత శ్రమపడిన యెడల ధనికులుగావడమే గాకుండా, ఉత్పత్తి సాధనాల సొంతదారులుకూడ కాగలరు. ఈ విధంగా ఆదర్శ ప్రాయమైన ఒక సంఘ విధానాన్ని చూపెడుచున్నారు కొందరు. ఈ సంఘము

నందు ప్రారంభంలో అందరూ సమానులేనని వీరి వాదన. కాని, తెలివిగలవారు, మితవ్యయులు, కష్టపడి పనిచేసేవారు - సహజంగా పెట్టుబడిదారీ విధానంలో ఉన్న ఏర్పరచు విధానాన్ని అనుసరించి - ధనికులౌతారు; ఆనందా న్ననుభవిస్తారు. ఎక్కువ ఖర్చుచేసేవారు, తెలివితక్కువవారు, సోమరిపోతులు సదా పేదరికం లోనే ఉంటారు అని వీరి వాదన. ఈ పగటికలలకును మానవ జీవితానికిని సంబంధమే లేదు.

అనుభవంలో, ప్రజాబాహుళ్యంలోని వర్గాలన్నిటికిని పెట్టుబడిదారీ విధానం "లాభం" పొందే అవకాశాలను కలిగించుచున్నదా? శ్రామికుడు కష్టపడి పని చేయడమూ ఒక్కొక్కప్పుడు తన శక్తినిమించి కష్టించడమూ "లాభం" వస్తుం దన్న ఆశవల్లనా, లేక దండింపబడతానన్న భయంవల్లనా? పెట్టుబడిదారీ విధానం నానాటికిని హెచ్చుతూన్న లాభాలను సమకూర్చి, శ్రమపడడానికి ప్రేరేపించగలి గిన ప్రజలు ధనికవర్గపు సభ్యులుమాత్రమే. వారికి, ఉత్పత్తి ప్రేరకం "లాభమే." శ్రామికవర్గం కష్టపడి శ్రమించుటకు ఎక్కువ కూలీ, ఎక్కువ జీతం అన్న ప్రేర కాలను కొంతవరకూ పెట్టుబడిదారీ విధానం ఉపయోగిస్తూన్న మాట వాస్తవమే. ఈ ప్రేరకాలు నానాటికిని క్షీణిస్తూ ఉన్నాయి. కాని, ఇంతకన్నా ఎక్కువ పరి మితికి, పెట్టుబడిదారీ విధానం, శ్రామికులను తమ శరీరాలను కష్టంలో కరిగించ మని (ప్రేరేపించడానికన్నా) బలవంత పరచుచున్నది. పెట్టుబడిదారీ విధానం యొక్క ముఖ్య ప్రేరకం సహకారంగాదు - విరోధమే. ప్రతిఫల ముంటుందన్న ఆశమీద ఆధారపడి యుండలేదు పెట్టుబడిదారీ విధానం; దండింపబడుదుమన్న భీతిమీదనే ఆధారపడియున్నది. సిద్ధాంతరీత్యా శ్రామికుడు స్వతంత్రుడే. కాని, యజమానుని షరతుల కొప్పుకోకపోయినచో ఉద్యోగం పోతూంది - జీవనాధార ముండదు. పైగా, ఉద్యోగంనుంచి తొలగింపబడిన శ్రామికునికి బదులు పనిచేయ డానికి ఎల్లప్పుడూ వేనవేలు నిరుద్యోగులు తయారుగా ఉంటారు. బానిస - యజ మాని కొలదాశద్దమే (బైటి కగుపడనందున మధ్యయుగపు బానిసత్వమున కన్న ఎక్కువ అపాయకరమైనది) పెట్టుబడిదారీ ఉత్పత్తికి ముఖ్య ప్రేరకం.

నిరుద్యోగులకు ఏ ప్రేరకాలను, లాభం దొరుకుతుందన్న ఏ ఆశలను పెట్టు బడిదారీ విధానం చూపెట్టుచున్నది? ఇంగ్లండు, అమెరికాలవంటి ఉత్తమోత్తమ పారిశ్రామిక దేశాల్లోగూడా, శ్రామికులలో 15% మొదలు 30% వరకు ఎల్లప్పుడూ

నిరుద్యోగులుగా ఉన్నారు. భారతదేశంలో నిరుద్యోగం క్రమేణ అభివృద్ధిచెందడం శోచనీయమైన విషయం. పెట్టుబడిదారీ విధానం ప్రజలనేవిధంగా నిరుత్సాహులను, నిర్వీర్యులను జేసి వారిలో నిస్సహాయతదృష్టి నెట్లు కల్గిస్తూందో భారతదేశంలోని మనకు పూర్తిగా తెలుసు. నిరుద్యోగులు కష్టపడి పనిచేయడాని కెట్టి అవకాశాలూ లేకుండా అది చేస్తూంది.

చరిత్రవలని అనుభవాన్ని ఉపయోగించుకొని సోవియట్ సంయుక్తరాష్ట్రం "లాభం" విధానాన్ని అన్యాయమైనదని, వృథాయని త్రోసిపుచ్చినది. వ్యక్తిగత లాభానికి బదులు మరేదన్నా శక్తివంతమైన ప్రేరకాన్ని సోవియట్లు కనిపెట్టవలసి వచ్చినది.

భూస్వామికిని, పెట్టుబడిదారునకును వ్యక్తిగత లాభం అన్న వ్యామోహం లేకుండా సంఘం అన్న యంత్రాన్ని ఏ యే ఉపాయాలతో సోవియట్లదేశం నడుపుచున్నది? పరిశ్రమల ప్రేరకంలో ఈ మహత్తర మార్పు నెలా తేగల్గినది?

ముఖ్యంగా రెండు మార్గాలు ఇందుకు అవలంబింప బడినవి. "స్వలాభం" అన్న పూర్వపు ప్రేరకాన్ని సంఘమంతటి శ్రేయస్సు కొరకు ఉపయోగపడేట్లు మార్చడం మొదటిది. రెండవది, ఉత్పత్తిని హెచ్చించుటకు ఇంతవరకు ఎన్నడూ ఉపయోగింపని నూతన ప్రేరకాలను కనిపెట్టి ఉపయోగించుచున్నది - ఆటల్లోవలె పోటీ చేద్దామన్న స్వభావం, ప్రజాభూషణ, ప్రజాదూషణ, తెలుసుకుందామన్న ఆతుర్దా, నేర్పరితనాన్ని పొందినప్పుడు గలిగే పరమానందం, ప్రత్యేక గౌరవం కొరకు ఆసించకుండా సంఘసేవ చేయవలయునన్న ఉత్సాహం. ఈ ఉత్సాహం క్రమేణా ఎట్టి శ్రమనైనా చేయ ప్రోత్సహించడమేగాక మహత్తర కార్యాలనుగూడ సాధించ గల్గుతూంది.

పరిపాలనా విధానముద్వారాను, ప్రభుత్వం శాసించే చట్టాలద్వారాను, ప్రజాబాహుళ్యానికి పంపే విన్నపాలలోను ఈ స్వలాభ, సంఘలాభ ఆశయాలు రెండునూ మిశితమై యున్నాయి.

స్త్రీ, పురుషులు శ్రమపడడానికి మనస్కరిస్తేనేగాని జీవనాధారాన్ని పొందడానికి అర్హులుగారన్న నమ్మకంమీద సామ్యవాద సంఘం ఆధారపడి ఉంది. శ్రమపడగల ప్రతి ఒక్కరూ శ్రమ పడడం అవసరమయ్యేట్లు చేస్తుంది సామ్య

వాదం. నిరుద్యోగాన్ని నిర్మూలించడం మూలంగా ప్రతి ఒక్కరూ పనిజేయడానికి వీలుకలిగేట్లు చేస్తుంది. పెట్టుబడిదారీ సంఘంలో, తమ తల్లిదండ్రులను జాగ్రత్తగా ఏర్పరచుకున్న కొద్దిమంది అదృష్టవంతులు కష్టపడి పనిచేయవలయునన్న బల వంతానికి లోనుగారు. సామ్యవాద విధానంలో ఆదాయం కావాలంటే తప్పక పని చేయవలసి ఉంటుంది. పెట్టుబడిదారీ విధానం ఎవరికైతే పనిచేయడానికి ఉద్దే శాన్ని - కారణాన్ని చూపించదో, వారికి (ధనికులకు) సామ్యవాదం పనిచేయ డానికి బలమైన కారణాన్ని చూపెట్టుచున్నది. సామ్యవాదమంటే కేవలం బానిస త్వమేనని కొందరు హృదయపూర్వకంగా ఏడ్వడానికి అసలు గుట్టు ఇదే కాబోలు!

ఉపయుక్తమైన, నిపుణతగల పనిని శ్రామికులు చేసేందుకు తగిన ప్రేరకా లను కల్పించుటకు సామ్యవాద సంఘం పరిపూర్ణత చెందిన పారితోషిక విధానాన్ని ఉపయోగించుచున్నది. మేలుపని చేసేవారికి ఎక్కువ కూలీ నిస్తుంది. దీనినిబట్టి కొందరు ఎక్కువ డబ్బుకొరకు ప్రజలందరూ పని చేస్తున్నారని అపోహపడు తున్నారు. కాని, ఎక్కువ డబ్బంటే వీరి ఉద్దేశం వ్యక్తిగతంగా డబ్బును చేర్చి పెట్టడమనీ - పెట్టుబడిదారీ యని. సామ్యవాదరాష్ట్రంలో ఉత్పత్తి సాధనాలను వ్యక్తిగత సొంత ఆస్తికింద దాచిపెట్టుకోడానికి వీలే లేదు. అంటే పనిచేయడాని కవసరమైన ప్రేరకాలన్నీ రూపుమాప బడినవని దీనికర్థంగాదు.

సౌఖ్యాన్ని, భద్రతను సంపాదించవలయునన్న స్వభావం ప్రతి మానవుని లోనూ వ్రేళ్ళు పాతుకుపోయిందని లెనిన్ గ్రహించాడు. ఈ స్వభావాన్ని సంఘోప యోగం కొరకు, సంఘోపయోగ కార్యాలవైపు మరల్చినచో ఈ స్వభావమే గొప్ప ప్రేరకమౌతుందని గ్రహించాడు. ప్రజలుచేయు సేవకు తగినట్లు వారికి పారితోషికమును ప్రోత్సాహమును ఇచ్చినయెడల ఈ ప్రేరకములు పెంపొందుత వని నమ్మినాడు. బాడుగ, మక్తా, లాభాల మూలంగా వ్యక్తులు పొందుచున్న ఆదాయం అపివేయబడినది - నిర్మూలింపబడినది. ఈ ఆదాయం లేకున్నా, వ్యక్తుల కష్టానికి తగిన పారితోషిక మివ్వబడడంవల్ల సాంఘిక సమానత్వానికి మోసం రాకుండా ఆర్థిక విధానం సాగింది. ఈ విధంగా, మేలైన పనికి హెచ్చుపనికి ఎక్కువ కూలీలనిచ్చే పద్ధతిని రష్యా కలిగియుండడమేగాక, ఈ ప్రేరకాన్ని అపా రంగా అభివృద్ధి పరచుచున్నది.

పైగా, ఈ ప్రేరకం సామ్యవాద సంఘంలో ద్విగుణీకృతంగా పనిచేయు చున్నది. ఇందుకు కారణం సోవియట్ సంయుక్తరాష్ట్రంలో శ్రామికులకు విరోధియైన పార్టీ లేనేలేదు. తమ కష్టం హెచ్చడం మూలంగా కలిగే ఎక్కువ లాభాన్ని శ్రామికులే పంచుకొనుచున్నారు. ఇతరులను ధనికులుగా చేయడానికవి వారు పనిముట్లుగా ఉపయోగింపబడడంలేదు. సామ్యవాదం అందరికీ సమానావకాశాలను కలిగించడం కేవలం సత్యం గనుకనే హెచ్చుకూలీ దొరికేపనిని చేయడానికీ, ఎక్కువ ఆదాయాన్ని పొందడానికీ ప్రతి శ్రామికునకును సర్వావకాశాలున్నాయి.

ఈనాడు చదువు, వర్గసంబంధం, కులం, మతం, కుటుంబస్థితి మొదలైన కారణాలు అనేకమంది శ్రామికులు ఉన్నతోద్యోగాలు పొందకుండా అడ్డుపడుచున్నవి. ఈ అడ్డంకుల నన్నింటిని రూపుమాపడం మూలంగా సామ్యవాదం శ్రమపడు ప్రజాబాహుళ్య మంతటికిని గొప్ప ఉత్సాహాన్నిచ్చుచున్నది.

"మేలుపనికి హెచ్చుకూలి" అన్న సిద్ధాంతాన్ని ఆచరణలోనికి తీసుకొని వచ్చుటకు ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ వీలుదొరికితే అప్పటి, కక్కడ సోవియట్లదేశం "తుంపు - పని" విధానాన్ని అమలులోనికి తెచ్చినది. "తుంపు - పని" అంటే ప్రతి పనీ కొన్ని తుంపులుగా - భాగాలుగా విభజింపబడి ఒక్కొక్క తుంపు కింతయని కూలీ లివ్వబడును. అంతేగాని, ఇన్నిగంటల కింత కూలియని గాదు. దీనినే ఆంగ్లంలో "పీస్ - వర్క్" అంటారు. ఈనాడు ప్రతివస్తూత్పత్తి గూడ కొన్ని చిన్నచిన్న భాగాలుగా భాగింపబడి సాగింపబడుచున్నది. ఒక గుండు సూదిని చేయడానికి షుమారు 360 ప్రత్యేక పనులు, ప్రత్యేక యంత్రాలు ఉపయోగింప బడుచున్నవి.

> "ఈ విధానం మూలంగా తన శక్తితో ఉత్పత్తి శక్తిని అభివృద్ధి పరచడంలో ప్రతి శ్రామికుడూ శ్రద్ధ వహించును. తద్వారా తన నిపుణత్వాన్ని, అర్హతను అభివృద్ధి పరచుకొన గల్గును."

ఒక్కొక్క రకపు పనికి గల గిరాకి ననుసరించి, ఆ పనియొక్క స్వభావాన్ని బట్టి శ్రామికులందరికీ ఒక కనీసపు కూలి - రేటు నిర్ణయింపబడినవి. ఒక్కొక్క శాఖకును, అందలి పనినిబట్టి, గంట కింత కూలికి తక్కువలేదనీ ఒక

కనీసపు కూలి - రేటు నిర్ణయించబడినది. ఏ శ్రామికుని ఏ పనియొక్క ఏ శాఖలో ఉంచడం అని నిర్ణయించడమెలాగు? వారి వారి నిపుణతను బట్టి, శక్తిని బట్టి వారిని క్రింది శాఖలలో ఉంచడమో లేక పై శాఖలో ఉంచడమో అని తీర్మానించ వలయును. కాని అది అంత సులభమైనపనిగాదు. అందువలన శ్రామికుల కోర్కెల ననుసరించి వారు ఏదో ఒక శాఖలో పనికి నియమింపబడుచున్నారు. క్రింది శాఖలో ఉన్న శ్రామికుడు ఎక్కడో ఉన్న పై శాఖకు పోవాలని కోరుతాడను కుందాం. ఒక్క షరతుమీద అతని కోర్కె నెరవేర్పబడవలసిందే - పై శాఖలోని పనికి తగిన నేర్పరితనాన్ని అతను ప్రదర్శింపగలిగి యుండడమే ఈ షరతు. తన శక్తి, సామర్థ్యాలను ఋజువుపరచగలిగియున్నచో అతను వెంటనే ఎక్కువ కూలిని పొందగలుగుచున్నాడు.

వెబ్బు దంపతులు తమ అభిప్రాయాల నీ క్రింది విధంగా వెల్లడించారు —

"ఎక్కువ ఆశగల్గి, ఎక్కువ శక్తిగల్గి, హెచ్చుకష్ట పడేవారు ఒక శాఖ నుంచి మరియొక శాఖకు, అక్కడినుంచి పై శాఖకు క్రమేణా పెరుగుచూ పైకి పోవడం పారిశ్రామిక వృత్తులలో అపారంగా అలవాట్లో ఉన్నది. ఈ విధానాన్నిబట్టి శ్రామికుడు నిలుపులేకుండా అత్యున్నత పదవిని చేర గల్గుచున్నాడు. మరేదేశంలోనూ, అమెరికాలోగూడ, ఈ అభివృద్ధి ఇంత సర్వసామాన్యంగా లేదు"

ఉత్తమమైన శ్రమ శక్తిని రేకెత్తించుటకు ఇంతకన్నా ఉత్తమమైన ప్రేరకం వేరే లేదు. వ్యక్తియొక్క శక్తిని, నిపుణత్వాన్ని గుర్తించడంకన్నా ఎక్కువ తృప్తికరమైనదేమున్నది? సామాన్య శ్రామికుడుగా నుండి నేర్పరితన మును సంపాదించి ఉన్నతస్థితిని పొందిన పిదప అంతకంటే యెక్కువ సాంకేతిక బాధ్యతగల ఉద్యోగాన్ని చేయుటకు, మేనేజరగుటకు ప్రతి సోవియట్ యువ కుడును ఉవ్విళ్లూరుచున్నాడు. సోవియట్లదేశంలో ఏ శ్రామికుడుగాని తన విచా రానికి కారణం "అభివృద్ధి లేకపోవడం" అని అనజాలడు.

కొంతమంది విమర్శకులు సామ్యవాదం తప్పనిసరిగా బానిసత్వాన్ని ఏర్పరు స్తుందనీ, అందుకు కారణం శ్రామికులను నియోగించే యజమాని ఒకే ఒక సంస్థ — రాష్ట్రం — మాత్రమే అయియుండడమనీ అంటారు. ఇది పూర్తిగా

అబద్ధం. నేడు రష్యాలో శ్రమ శక్తిని నియోగించే సంస్థలు మూడు రకాలవి ఉన్నాయి —

(1) రాష్ట్రీం, పురపాలక సంఘాలు.

(2) ఉత్పత్తిదారుల సహకార సంఘాలు.

(3) కొనుగోలు దారుల సహకార సంఘాలు.

ఒక్కొక్క రకపు సంస్థలలోను ఉద్యోగాన్నిచ్చే సంస్థలు, పలువిధములైనవి, అనేక మున్నవి.

కూలికి పనిజేయడం ఇష్టంలేనతను దేశంలోని 2,50,000 సముదాయ క్షేత్రాల్లో ఒకదానిని చేరవచ్చు. లేదా, ఉత్పత్తిదారుల సహకార సంస్థలలో ఒక దానిని చేరవచ్చు. లేదా, కావలసిన తెలివి తేటలు, నిపుణత, శక్తి ఉంటే తాను సొంతంగా వస్తూత్పత్తి సాగించి తన వస్తువులను బజారులో అమ్ముకోవచ్చు. ఇష్ట మున్నచో తాను స్వతంత్రుడైన పత్రికా విలేఖరిగావచ్చు. లేదా, గ్రంథకర్త గావచ్చు. లేదా, చిత్రలేఖకుడు గావచ్చు; గాయకుడు గావచ్చు. ఇవన్నీ కాకుంటే ఇండ్ల తాపీ పనివాడుగావచ్చు. పై పనులలో దేనిని చేయడానికైనా అతనికి మనస్కరించినచో ఉత్పత్తిదారుల సహకార సంఘాన్ని చేరవచ్చు. ఇష్టంలేదా, ఒంటరిగా తానే శ్రమపడవచ్చు. అతను చేయకూడనిది - చేయలేనిది ఒక్కటే. అది మరొకనిని కూలీకి కుదుర్చుకొని, అతనినుండి శ్రమ శక్తిని ఊడ్చి, అందునుండి లాభం సంపాదించలేక పోవడం. ఈవిధంగా సమిష్టి జీవనాన్ని గడిపేసంఘం వ్యక్తిగత స్వాతంత్ర్యాని కనువైన పోకడలకుగూడ కావలసినంత అవకాశాన్నిస్తూన్నది.

సముదాయ క్షేత్రాల విషయంలో తగిన శ్రమను రాబట్టుటకు అనేకవిధములైన ప్రేరకాలు మిశ్రమమై ఒక నూతన ఆకారాన్ని దాల్చినవి. ప్రపథమంగా, సభ్యులందరికిని తామందరూచేసే మొత్తం కష్టంమీద, తాము పంచుకునే మొత్తం ఫలితం ఆధారపడి ఉంటుందని తెలుసు. ప్రతి రైతూ పొందవలసినపాలు అతను చేసిన శ్రమనుబట్టి నిర్ణయింపబడుచున్నది. ఈ ప్రేరకాలకు తోడు, సముదాయ క్షేత్రాల సభ్యులు వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకోవచ్చు. తత్ఫలితాన్ని తమ కుటుంబ అవసరాలను తీర్చుట కుపయోగించుకోవచ్చు. లేదా, బజారులో విక్ర

యించుకోవచ్చు. ఈవిధంగా సోవియట్ ప్రభుత్వం సముధాయక్షేత్రపు రైతు ఒక ఆవునో, పందినో, కోళ్లనో కలిగి ఉండడానికిని, తన ఇంటిచుట్టూ 3 ఎకరములకు మించని భూమిని తన సొంతానికి దున్నుకోడానికిని అపరిమిత ప్రోత్సాహాన్ని ఇచ్చుచున్నది.

పాత ప్రేరకాలను ఉత్పత్తి కుపయోగపడేటట్లు సోవియట్లు ఏవిధంగా మార్చినవో నిరూపించడానికి పై ఉదాహరణలుచాలు. ప్రస్తుతం సోవియట్ ఉత్పత్తి విధానంమీద హెచ్చుప్రభావంగల "సంఘసేవ" అన్న ఉద్దేశాలను గమనించుదాం!

స్త్రీ. పురుషులు కేవలం తాత్కాలిక వ్యక్తిగత స్వలాభాలను పాటించెదరు గాని, మరి యే యితర ప్రేరకాలకును సుముఖులుగారన్న వాదన సత్యదూరమైనది. సోవియట్ ప్రభుత్వం తన ప్రజలనుండి స్వార్థతలేని నిర్మాణ ఉత్సాహాన్నెంతనో రేకెత్తించ గల్గింది. కొంతవరకూ ఈ కార్యాన్ని బహుమానం - దండన, దూషణ - భూషణల మూలంగా సాధించగల్గింది. ఈ పద్ధతులు సూటిగా వ్యక్తికి సంబంధించినవైనా, వ్యక్తియొక్క ఆర్థికస్థితికి ఏవిధంగానూ సంబంధించినవి కావు. సోవియట్ సంయుక్తరాష్ట్రంలో ఈ విధానం, బాగైనపనిని పదిమందిలో పొగడడం, ఓగైన పనిని పదిమంధిలో దూషించడంగా పరిణమించింది.

నాగరిక దేశాలన్నిటిలోగూడ, వేనవేల ఏండ్లుగా, పదిమందిలో గౌరవించడం సంఘసేవా బుద్ధిని కల్గించడానికి అతి శక్తివంతమైన కీలకంగా - ప్రేరకంగా ఋజువుపరచబడింది. సోవియట్ సంయుక్తరాష్ట్రంలో ప్రతిఫాక్టరీలోను "గౌరవనీయులు" అన్న శీర్షికతో ఒక వ్రాతబల్ల ఉంటుంది. ఆ ఫాక్టరీలోని శ్రామికులందరూ చూచేట్లు బాగుగా పనిచేసినవారి పేర్లు ఈ నల్లబల్లమీద వ్రాయబడతవి. ఏ ముఠా అయినా ప్రత్యేక ఘనకార్యాన్ని నెరవేర్చినచో ఫాక్టరీ శ్రామికులందరూ ఒక బహిరంగ సభ జరిపి, ఆ సభలో ఆ ముఠావారికి అభినందనములర్పించెదరు - సన్మానించెదరు. అధిక శ్రమపడి సంఘసేవ చేసినవారికి "శ్రామిక వీరుడు" అన్న బిరుదునిచ్చి గౌరవించెదరు. వీరిని నూనెరంగులలో చిత్రించి ఆ చిత్రాలను ప్రదర్శించెదరు. విశ్రాంతి భవనాల్లోనూ, సంస్కృతి నభివృద్ధి చేయుట కేర్పరుపబడిన వనాల్లోనూ వీరి శిలావిగ్రహాలను ప్రదర్శనార్థం స్థాపించెదరు. ప్రఖ్యాతిగాంచిన వైజ్ఞానికులను "వైజ్ఞానిక సభ"లో సభ్యులుగా చేర్చుకుంటారు. గొప్ప కవులను, చిత్రకారులను సగౌరవంగా గుర్తించెదరు.

చాలా గొప్ప సంఘసేవ చేసినవారికి బిరుదులను, పతకాలను ఇచ్చెదరు. వీటిని ప్రజ లెక్కువగా గౌరవించడమే గాకుండా, వీటిని పొందడం ఒక గొప్ప భాగ్యంగా గూడా తలచుచున్నారు. రష్యాలో ఈ బిరుదులు కేవలం శక్తినిబట్టి బహూకరింప బడుచున్నవి గాని పుట్టుకనుబట్టి గాదు. ఈ బిరుదులలో ముఖ్యమైనది "ఆర్డర్ ఆఫ్ లెనిన్." ఈ బిరుదు అఖండ సంఘసేవ చేసినవారికి మాత్రమే - ముఖ్యంగా కాయకష్టానికి - ఇవ్వబడుచున్నది. "రెడ్‌బానర్ ఆఫ్ టాయిల్", "ది ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌స్టార్" అని మరి రెండు బిరుదులున్నాయి. ఈ బిరుదులలో ప్రతి ఒక్కటీగూడ గౌరవంతోపాటు కొన్ని ప్రత్యేక ఆదాయాలనుగూడ సమకూర్చుచున్నది - నాటకాల టిక్కెట్లు ఉచితం; ముసలితనంలో భరణాలు, పన్నులు గట్టవలసిన నిమిత్తం లేకపోవడం.

అలవాటునుబట్టి ప్రతివ్యక్తియు సాధారణంగా ఇంత కష్టాన్ని చేయగలడని ఒక ఉజ్జాయింపు ప్రతి శ్రామికునకును తెలుసు. ఈ పరిమితికంటె తక్కువ కష్టం చేసేవాళ్లను, ఉత్పత్తి శక్తిని కలిగియుండిగూడ సోమరితనంవలననో, త్రాగుడు వలననో తమ శక్తికి తగినట్లు ఉత్పత్తిచేయని వారిని సరియైన దారికి తీసుకొని వచ్చుటకు "ప్రజాదూషణ" (అనగా ప్రజలచే దూషింపజేయుట) విధానాన్ని, క్రమపద్ధతిని సోవియట్ సంయుక్తరాష్ట్రం అభివృద్ధి పరచినది. ఓగుగా పనిచేసే వారి పేర్లు వ్రాయుటకు కొన్ని ప్రత్యేక వ్రాతబల్లలేర్పాటు చేయబడినవి. తాగుడు వలన బాగుగా పనిచేయనివారి కార్టూన్లను (హాస్యపు బొమ్మలు) ఈ వ్రాతబల్లలపై గీచెదరు. గోడలపై అంటించు పత్రికలు ఈ సోమరి పోతులను ఖండించును. చక్కగా పనిచేయనివారిని సోదర వాత్సల్యంతో మందలించుటకు "కామ్రేడ్ల న్యాయస్థానాలు" విచారణ చేయును. ఈ ప్రేరకాలు అత్యంతోపయోగకారకములని ఋజువైనది.

ఆటలు, పోటీలలో మానవునికి గల ఆసక్తిని పారిశ్రామిక, వ్యవసాయక ఉత్పత్తిలోని దైనందిన కార్యక్రమానికి ఉపయోగ పడునట్లు సోవియట్లు చేయగల్గినవి. ఈ ఆసక్తి "సామ్యవాద పోటీ" రూపందాల్చినది. ఆటలలోగాని, పందెములలోగాని, క్రాస్‌వర్డ్ పజిల్స్‌లోగాని (పద సమస్యలు) ఇతరుల నోడించి తానే బహుమానం పొందవలయునన్న కోర్కె ప్రతి మానవునిలోనూ స్వతహ ఉన్నదని మన మెరుగుదుము. ఈ స్వభావాన్ని పురికొల్పి ఫాక్టరీలమధ్య స్నేహ

పూరితమైన పై పోటీని కల్పించి తద్వారా ఉత్పత్తి నధికము చేయుచున్నారు. సోవియట్ సంయుక్తరాష్ట్రంలో ప్రస్తుతం శ్రామిక శక్తి "గౌరవనీయమైన విషయం, ధైర్యాన్ని ప్రకటించే విషయం, నాయకత్వాన్ని వహించే విషయం"గా మారింది.

"సామ్యవాద పోటీ" ప్రస్తుతం అనేక రకాల పనులను చేయడాని కుపయోగింప బడుచున్నది. ఒక ముఠా శ్రామికులు ఇంకొక ముఠాను పై పోటీకి పిలుస్తున్నారు. ఒక ఫాక్టరీ మరొక ఫాక్టరీని పందానికి ఉసిగొల్పుచున్నది - ఎవరెక్కువ ఉత్పత్తి చేస్తారో చూద్దాం రా! అని. ఒక నగరం మరొక నగరాన్ని పోటీకి ఉసిగొల్పవచ్చు. అత్యవసరంగా ముగించవలసియున్న పనిని పూర్తిచేయుటకు లేక ఒక పని నచ్చుగా సాగుతూంది గనుక దానిని త్వరలో ముగించుటకు కొన్ని నగరముల నివాసు లందరూ తమంతట తాము తమ సెలవు రోజులలోవచ్చి స్వచ్ఛంద సేవ చేసిన నిదర్శనా లున్నాయి. ఇందుకొక్క ఉదాహరణ — మాస్కో భూగర్భ రైలు మార్గాన్ని నిర్మించేటప్పుడు ఆ మట్టిని త్రవ్విపోయుటకు అవసరమైన "నిపుణతలేని శ్రామికులు" అసంఖ్యాకులు దొరికనందున ఆ పనిలో చాలాభాగం పై విధంగా నగరవాసులందరిచే సెలవు రోజులలో చేయబడినదే.

సోవియట్ సంయుక్తరాష్ట్రంలో పోటీలలో గెలుపొందినవారు ఓడిపోయిన వారికి మేలు రకపు పనిని ఎలా చేయడమో నేర్పించెదరు. "ఉదర్నికి" లేక "షాక్ బ్రిగేడ్స్" అన్నపేర అతి చాకచక్యంతో పనిచేసే శ్రామికుల ముఠాలున్నాయి. "బ్రిగేడ్" అన్న ఆంగ్లపదానికి "ముఠా" అని అర్థం. విద్యుచ్ఛక్తి నంటినయెడల ఒడలు ఎలా జలదరిస్తుందో అంతటి ఉద్వేగ, ఉత్సాహాలతో వీరు శ్రమపడుచున్నారు గనుక వీరిని ఆంగ్లంలో "షాక్ బ్రిగేడ్స్" అన్నపేర పిలుస్తారు. ఉత్తమోత్తమమైన ఉత్పత్తిని సాగింపలేకున్న ఫాక్టరీలకు ఈ "ఉదర్నికి" వెళ్ళి సాయపడెదరు. ఈ విధంగా సోవియట్ల దేశంలో కొందరు శ్రామికులు, తమంతట తాము, తమ తోడి శ్రామికులకు సాయపడి, ప్రోత్సహిస్తారు. ఈ అలవాటును రష్యను భాషలో "షెఫ్స్టోవ్" అంటారు. ప్రస్తుతం ఇది యొక సంస్థగా మారింది. ఈ సంస్థమూలంగా చక్కగా నడుపబడని సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని నడుపుటకును; క్రమపద్ధతిని సాగని ప్రాథమిక పాఠశాలలను సాగించుటకును

బలహీనముగా ఉన్న సంస్థలకు సాంకేతిక, నైతిక, భౌతిక సహాయాన్ని చేయు టకును ఏ ఎఱ్ఱసైన్యపు దళమో, లేక ఏ వైజ్ఞానిక కళాశాలయో, లేక ఏ ఒక ఫాక్టరీయో శాశ్వతంగా శ్రద్ధవహించి, కొంత బాధ్యత తనమీద వేసుకొని ఉద్ధ రించవచ్చు.

సంఘసేవ చేయవలయునన్న సదుద్దేశం దేశమంతటా కావలసినంత వ్యాపించియున్నది. దీనిని తగిన రీతిని ఉపయోగించుకొనుటకు పై మార్గాలు - మరి అనేక విధానాలు - కల్పించబడినాయి. సోవియట్ సంయుక్తరాష్ట్రంలో ప్రతి ఒక్కరూ తనవృత్తిగాక - అంటే తాను కూలి పొందడానికి చేస్తున్న పనిగాక - మరొక పనిని దేనినైనా సంఘసేవకై చేయుట అత్యవసరమై యున్నది. ఈపని, శ్రామికుడు తన తీరిక సమయంలో చేసేట్లుండవలయును. కమ్యూనిస్ట్ నైతిక అలవాట్ల ననుసరించి తనతోడివారల — ప్రజల అభిప్రాయాలనుబట్టి కేవలం సంఘసేవగా కష్టపడి ప్రతివాడును ఏదో ఒక కార్యనిర్వహణకు పూనుకుం టున్నాడు.

ఈవిధంగా, సామ్యవాదం అనేక రకాల ప్రేరకాలను పెక్కింటిని సృష్టించ గలిగింది. ఈ ప్రేరకాల ఫలితాలు ఎంత ఫలవంతంగా ఉన్నాయో మనం కొంత వరకూ గ్రహించ గలిగాము. నూతన సాంఘిక ఆదర్శంవలన ప్రోత్సహించబడి సాంఘిక, సాంస్కృతిక ఉద్ధరణ అతి వేగంగా ముందుకు సాగుతూ ఉన్నది. ఉత్పత్తి అపారంగా పెరిగింది. సోవియట్ వైజ్ఞానికులు ప్రపంచశాస్త్ర జ్ఞానానికి గణనకెక్కిన తోడ్పాటు నిచ్చారు. ప్రజాసైన్యం ఫాసిస్టు క్రౌర్యాన్ని ధైర్యంతో ఎదుర్కొన గల్గింది. కష్టపడి పనిచేయడానికి నూతన ఆశయాన్ని, ఉపయుక్తమైన ఆశయాన్ని చూపి సోవియట్ సంయుక్తరాష్ట్రం ఉత్తముడైన నూతన మానవుని సృష్టించుచున్నది.

---

# 4. సోవియట్ మధ్య ఆసియా

(యస్. ఉపాధ్యాయ్)

మధ్య ఆసియాలో యుగ యుగాలుగా కృశించిపోతూన్న మానవకోటిని సోవియట్లు ఎలా ఉద్ధరించగలిగినవన్న విషయం సోవియట్ల నూతన ప్రపంచం లోని అన్ని విషయాలకన్నా ఎక్కువగా మన హృదయాన్ని ఆకర్షిస్తూంది. మధ్య ఆసియా సామర్ఖండ్, బొఖారా దేశాలున్న పుణ్యభూమి. పురాతనదేశం. కాని అనేక దోపిడిదారులచే పీడింపబడ్డది. దిగ్విజయములను సాగించిన మహా వీరులు ఈ మధ్య ఆసియా నగరాలచే ఆకర్షింపబడ్డారు. ఈ భూమి సౌందర్యాన్నీ, సంపదనూ వశపరచుకోవాలని అనేకులు పరితపించారు కాని ఎవ్వరూ ఈ భూమిని సొంతం చేసుకోలేక పోయారు. మధ్య ఆసియా మృత్యు వాక్రమించినదేశం. ప్రాచ్య దేశాల ప్రతిభ ఇచ్చట పాతిపెట్ట బడ్డది. ఇచ్చటి నగరములమీద నేటికి అలెక్జాండర్, ఛెంగిజ్ఖాన్ల స్మరణ విహరిస్తుంటుంది. ఇచ్చట, ఆసియాఖండం మధ్య, ఆసియాఖండం హృదయంలో ప్రాచ్యత పునర్జన్మ నొందిం. ఒక్కమారు జమీందారీ విధానంనుంచి సామ్యవాదానికి గంతువేసింది. మధ్య ఆసియా మట్టిని నేడు విప్లవం వర్ధిల్లుతూ ఉంది. "కొద్దిమందికి ప్రత్యేకించ బడిన విశ్రాంతి కాదు - అందరికీ ఉపయుక్తమైన పనీ, సౌఖ్యమూ" అన్ననినాదంతో మధ్య అసియా నిండిపోయింది. సామ్యవాద నిర్ణీత విధానం సాయంతో విజ్ఞానం ఇచ్చట మహత్తర కార్యాలను సాధిస్తూంది. ఈ దేశపు ఫలవంతమైన భూమిని విరామం లేకుండా, ఓర్పుతో, వందల కొలది మర నాగళ్ళు దున్నుతున్నాయి. రైతు బిడ్డలు తమ సమిష్టి బలాన్నీ, ఐకమత్యతనూ గుర్తెరిగారు. సామ్యవాదం వీరికి మార్గదర్శకురాలు; యంత్రం వీరి నమ్మకమైన బంటు; వీరు కట్టుబాట్లలోనుండ నేర్చుకున్నారు.

ప్రాచ్య జమీందారీ విధానపు శిధిలాలమీద ఈ నూతన నిర్మాణం నిలిచి వుంది. ఈ నిర్మాణాన్నే సోవియట్ మధ్య ఆసియా అని పిలుస్తున్నాం. ప్రాచ్యత యొక్క హృదయం దహింపబడినది. ఈ అగ్నిజ్వాలలు పూర్వపు మలినా

న్నంతటిని దగ్ధం చేసినవి. నూతన ప్రపంచం సృష్టించబడింది. ఈ ఎండు భూమిలో పారిశ్రామిక సంస్థలతో అలంకరింపబడ్డ కొత్త నగరాలు తలచూపుచున్నాయి. పూర్వంవలె ఇప్పుడు మధ్య ఆసియాను చేరడం అసాధ్యం కాదు. ఆధునికుల రాక పోకల వసతుల మూలంగా మధ్య ఆసియా, అతి వేగంతో సడుస్తూన్న పాశ్చాత్య ప్రపంచాన్ని సమీపించింది. కొండలు, ఎడారులగుండా గొలుసులవలె రైలు మార్గాలు అల్లుకు పోయాయి. ఈ రైలు మార్గాలు మధ్య ఆసియా నుంచి పాశ్చాత్య ప్రపంచందాకా అల్లుకున్నాయి. ఇరాన్, అఫ్గనిస్థాన్, చైనాల నానుకొనియున్న ఈ మధ్య ఆసియా నాల్గు సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్య యూనియన్లుగా విభజింప బడ్డది —

(1) ఉజ్‌బెక్ యూనియన్ (సంయుక్తరాష్ట్రం).
(2) తుర్క్‌మేనియన్ యూనియన్.
(3) తజిక్ యూనియన్
(4) కిర్‌ఘిజ్ యూనియన్.

ఇవికాక అధినివేశ ప్రతిపత్తిగల ప్రజాస్వామ్య మొకటున్నది - కర - కల్‌పక్.

## అమీర్ పరిపాలన

పూర్వం మధ్య ఆసియా "మతగురువులు" పరంపరచే పరిపాలింపబడుచూ వచ్చింది. మహమ్మదీయ ప్రాచ్యదేశాలకు బొఖారా ముఖ్యపట్టణంగా వుండేది. ఈ రాజ్యాలకు అమీర్ ప్రభువు. అతని అధికారం నిరంకుశం. అన్ని దేశాల్లో కూడా నిరంకుశత్వం సాధారణంగా సాగేది. అమీర్ బంట్లు ప్రజలను సర్వ విధాల పీడించేవారు. ప్రజ లపరిమితమైన పన్నులను చెల్లించాలసుండేది. పంటలు, పశువులు, వస్తువులు, ఆఖరుకు బల్లకట్లమీదగూడా పన్నులుండేవి. ఇవిగాక ప్రతి కుటుంబంలోని ప్రతివ్యక్తి సాలీనా పన్నుచెల్లించాలసి వుండేది. ఈ డబ్బంతా కూడా అమీర్ బొక్కసానికి పోయి చేరేది. ఇందులో 10% మాత్రం మసీదుల కని ప్రత్యేకింప బడేది. అమీర్‌వద్ద కోట్ల కొలది డబ్బుండేది. అతను విదేశాల్లో దాచుకున్న పెట్టుబడిమాత్రం రూ. 15,00,00,000. నిరంకుశుడు గనుక ప్రజలలో విద్యాగంధం వ్యాపించిన తన పరిపాలనను ఖండిస్తారని తెలుసుకున్నాడు. అందు

వలన విద్యకు సంబంధించిన విషయాలన్నీ మహమ్మదీయ మత ప్రచారకులైన ముల్లాలకు ఒప్పగించాడు. వారు కేవలం మత అలవాట్లు, మతానికి సంబంధించిన కర్మ కాండను సాగించను అవసరమైన విద్యను మాత్రమే నేర్పేవారు. అందు వలన ప్రజలందరు ఎల్లప్పుడూ పేదరికంలో, మూఢత్వంలో కృశించవలసి వచ్చింది. విప్లవం తన సంకెళ్లను భేదించేవరకు మధ్య ఆసియా కథ ఇది.

19 వ శతాబ్దంలో మధ్య ఆసియా జారులకు ప్రత్తిని సరఫరా చేసే వలస రాజ్యమైంది. తద్వారా, పెట్టుబడిదారి ఆర్థిక విధానంలోకి మధ్య ఆసియా ప్రవే శించింది. గ్రామాల ఆర్థికస్థితి మార్పు చెందింది. మారకం ప్రాధాన్యం వహిం చింది. రష్యను పెట్టుబడి దారులు బ్యాంకులను, వ్యాపార కేంద్రాలను స్థాపిం చారు. వీటిమూలంగా రైతు దివాలా తీశాడు. జమీందారులు, కూలక్కులు వృద్ధి పొందారు. ప్రత్తిని పండించడానికి ఎక్కువ పెట్టుబడి కావాలి. రైతులు నిరుపేదలై యున్నందున ఈ పెట్టుబడిని ధనికులనుంచి అప్పుకు పుచ్చుకోక తప్పిందికాదు. వడ్డీ అపరిమితంగా వుండేది. మార్వాడీ వడ్డీకాదు, కాబూలువారి వడ్డీయే. ప్రత్తిని పండించే జిల్లాల్లో సగంప్రజలు సొంత భూమి లేనివారు. భూమిలేని రైతులనే కులు పశువుల మేపుకుంటూ దేశమంతటా తిరుగ నారంభించారు. భూమిలేని రైతుల సంఖ్య అపారంగా పెరగడంవలన వీరందరూ పనిని వెతుక్కుంటూ తిరుగ నారంభించారు. వీరిలో కొందరు బందిపోటుదారులయ్యారు. వీరే తర్వాత మధ్య ఆసియాలోని "బస్మాషి" అన్న బందిపోటు ముఠాగా ఏర్పడ్డారు. అక్టోబరు విప్లవం (1917) ఈ ప్రాచ్య జమీందారి విధానాన్ని అంతమొందించి, కష్టజీవులను రక్షించింది.

## విప్లవానికి ముందు

రోమనోవ్ కుటుంబం (జారులవంశం) పుచ్చిపడిన కొంప కూలినట్లు అమాంతం ఒక్కమారు కూలిపోయింది. విప్లవ ద్రోహులు విప్లవకారులని పేరు పెట్టుకొని విప్లవాన్ని నాశనంచేయ ప్రయత్నించినా విప్లవం ముందుకు సాగుతునే వుంది. తాత్కాలిక ప్రభుత్వం కూలద్రోయబడింది. కెరన్‌స్కీ పారిపోయాడు. బోల్షివిక్కులు అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. బోల్షివిక్కులు "ప్రజల

హక్కుల ప్రకటన"ను వెలువరచగానే జారుల పరిపాలన క్రింద కృశించిన ప్రజలందరికి విముక్తీ, స్వాతంత్ర్యం లభించినవి. బోల్షివిక్కులు —

> "రష్యాలోని ప్రజలందరూ సమానులు; స్వతంత్రులు ఏ ప్రజకు ఆ ప్రజయే సర్వాధికారాన్ని గలిగివుంది. రష్యాలోని ప్రతి జాతీ స్వయం నిర్ణయానికి హక్కుగలిగివుంది. ఇష్టమైతే ఏ రాష్ట్రంగాని రష్యానుండి విడి వడి స్వతంత్ర రాజ్యంగా వుండవచ్చు. జాతీయ, మత కారణాలవలన కలిగే ప్రత్యేక హోదాలు, సౌకర్యాలు రూపుమాపబడ్డవి. జారులు జాతిని, మతాన్నిబట్టి ప్రజలను లోంగచేసిన నిష్కర్షలు, నియమాలు గూడ రూపుమాప బడ్డవి. రష్యాలోనున్న జాతీయ అల్ప సంఖ్యాకులందరూ, వారి వారి జాతీయతనూ, సంస్కృతినీ, సారస్వతాన్నీ అభివృద్ధి పరచుకొనను సర్వావకాశా లొసగబడుతవి."

అని ప్రకటించారు.

తర్వాత "రష్యా, ప్రాచ్యదేశాల మహమ్మదీయుల ప్రకటన" లెనిన్, స్టాలిన్‌ల సంతకాలతో వెలువడింది. "ఎవరి మసీదులు, ప్రార్థనా లయాలు నాశనం చేయబడుచున్నవో, ఎవరి శాంతియుతమైన అలవాట్లు, అభ్యాసాలు రష్యాను హింసిస్తూన్న జారులచే కాలికింద రాచివేయబడుచున్నవో" అట్టి మహమ్మదీయులందరినీ ఏకముకమ్మని ఆ ప్రకటన కోరింది. అమీర్ బెదరినాడు. విరోధితో పోట్లాడను తీర్మానించుకున్నాడు. బోల్షివిక్కుల మాటల మాటున ఏవో కుట్రలున్నాయన్నాడు. జారుల వలసరాజ్య విధానానికి ఈ ప్రకటన మరోరూప మన్నాడు. అందువల్ల సలహాను, సహాయాన్ని ఇవ్వమని - బోల్షివిక్కుల నెదుర్కొనను - గ్రేట్ బ్రిటన్‌ను కోరాడు.

పై ప్రకటనకు బొఖారాలోని జాతీయ వాదులు తగినవిధంగా తమ సమ్మతిని వెల్లడించారు. కాని జాతీయవాదులలో కక్షీ లేర్పడినవి. ఒక కక్షీ బోల్షివిక్కుల సలహాలను అంగీకరించాలెనని వాదించింది. అమీర్ పరిపాలన నానాటికి ఎక్కువ నిరంకుశ మయ్యేటప్పటికి హెచ్చుమంది జాతీయ వాదులు బోల్షివిక్కులతో చేరారు, ఇందుకు కారణం ప్రజల భావ చైతన్యంకాదు. ఈ జాతీయ వాదులకు బోల్షివిజంలో పిసరైనా నమ్మకం లేదు. అప్పట్లో ఈ జాతీయవాదులకు, బోల్షివిక్కులపట్ల గల సహకారభావం క్రమేణా సఖ్యతపగాని, ఐకమత్యానికి

గాని, సయోధ్యకుగాని దారి తీస్తుందని అనుకోడానికైనా వీల్లేదు. కాని, అమీర్ ఏదో కుట్ర ఉన్నదని సందేహపడి పెట్రొగ్రాడ్‌తో - అప్పటికే పెట్రొగ్రాడ్ బోల్షివిక్కుల కేంద్రస్థానమైంది - రహస్య రాజకీయ సంబంధాల తెంచివేశాడు. గ్రేట్ బ్రిటన్, అఫ్గనిస్థాన్, ఇరాన్‌లతో స్నేహాన్ని ఆరంబించాడు. ధనికులైన రైతులు, ముల్లాలు, బస్‌మాచి (బందిపోటు దొంగలు)ల సహాయంతో విప్లవాన్ని అరికట్ట ప్రయత్నించాడు. విప్లవం అభివృద్ధి కానారంభించిన తర్వాత వర్గ వైషమ్యం ఎక్కువ కాజొచ్చింది. జాతీయవాదులు ఫిబ్రువరి (1917) విప్లవాన్ని వాంఛించికూడ కొత్తగా ఏర్పడిన ప్రభుత్వంపట్ల విరోధం పూనారు. అందువలన విప్లవానికి కొత్త విరోధులుగూడ ఏర్పడ్డారు. జమీందారి, మత, ఉన్నతోద్యోగ శక్తులన్నీ ఒక్కటై నూతన ప్రభుత్వాన్ని నాశనంచేయ పూనుకున్నాయి. వీటన్నిటికీ సహాయంగా బస్‌మాచి పనిచేసింది. విప్లవోద్యమం పెరుగ నారంభించింది - తీవ్రతరమైంది. కాని నాయకులు వెంటనే జయం పొందలేకపోయారు. ఇందుకు కారణ లనేకమున్నాయి - (1) అప్పటి సమస్యను చక్కగా గ్రహించలేక పోవడం, (2) ఆర్థికదుస్థితి ఎక్కువ కావడం, (3) ప్రజాబాహుళ్యంయొక్క మూఢత్వం. అందువలననే ప్రజలు అమీర్ మాటలనమ్మి, మోసపోయి విప్లవాన్ని ఎదుర్కొ నారంభించారు. అమీర్‌కు అనుకూలపడ్డ ఇతర పరిస్థితులుకూడా ఉన్నాయి. గ్రేట్ బ్రిటన్‌నుంచి పంపబడిన ప్రత్యేక రాయబార మొకటి బొఖారా చేరింది. ఈ రాయబారం అమీర్‌వద్ద అత్యంత పలుకుబడిని సంపాదించింది. ఈ రాయబార ఉద్దేశం వ్యాపారం అని పైకి అన్నారు. ఈ రాయబారంలో ముఖ్య సభ్యుడైన లెఫ్టినెంట్ కలనల్ పి. టి. ఇథెర్‌టన్ ఈ రాయబార ఉద్దేశాన్ని తెలియజేశాడు -

> "1918 లో మధ్య ఆసియాలో ప్రత్తి అపారంగా ఉంది. ఈ ప్రత్తిగతి కేవలం సమయస్ఫూర్తిమీద ఆధారపడివుంది................ అందువలన బ్రిటిష్ ప్రభుత్వం వెంటనే మధ్య ఆసియాకు వెళ్ళి ఈ ప్రత్తిని కాష్‌ఘర్ కెలా చేర్చడమో ఆలోచించమని నన్ను ఆజ్ఞాపించింది." *

నిజంలో ఈ ప్రత్తిని కాష్‌ఘర్ చేర్చను ఏపాటి ప్రయత్నం చేయబడలేదు.

---

* జోషువ కునిట్జ్ వ్రాసిన "సోమర్‌ఖండ్ పై సూర్యోదయం" అన్న గ్రంథంలోనుంచి.

ఈ రాయబారవర్గంయొక్క ఆంతరంగిక కథను ఇందులో పనిచేసిన తెల్ల రష్యను ఒకాతను బయట పెట్టాడు. ఈతని పేరు జనరల్ జెయ్‌త్సేవ్.—

> "తుర్కిస్థానంలోని సోవియట్ ప్రభుత్వం మీదికి సాయుధ తిరుగుబాట్లను తయారుచేయడం, సాగించడం; దగ్గరనున్న ఆంగ్లేయుల ఆయుధ సరఫరా కేంద్రాలైన మెషెడ్, కాష్ఘర్, అఫ్గనిస్థాన్‌లనుంచి ఈ తిరుగుబాటు దార్లకు ఆయుధాలను, డబ్బును సరఫరా చేయడం."

ఈ రాయబారంయొక్క పన్నుగడలు పడమట సామ్రాజ్యవాదులు అవలంబించిన వాటితో భిన్నంగానున్నా ఈ రాయబారంగూడా సోవియట్ పరిపాలనను ధ్వంసం చేయాలన్న దృష్టితోనే శ్రమ పడింది. సామ్రాజ్యవాదుల దుఃఖానికితోడు ఈ రాయబారంగూడ తన ఆశయాన్ని సాధించలేక పోయింది.

1918 లో బొఖారా రష్యాతో ఎలాంటి వ్యాపారం చేయలేక పోయింది. బొఖారాలో ఉత్పత్తి వస్తువులు అరుదైనవి. ముడివస్తువు లపారంగా మురిగిపో తున్నాయి. అలా ఉండికూడ ప్రక్కనే ఉన్న రష్యాతో వ్యాపారం చేయడానికి వీల్లేకపోయింది. కారణాలను ముందు గమనించాం. ఎర్రసైన్యం జయదుందుభుల మ్రోతతో ముందుకు సాగుతునే ఉంది. రైతు బిడ్డలు చేరడంతో ఎర్రసైన్యం సంఖ్య, బలంకూడా పెరిగింది. ఇంగ్లండువచ్చి తన్ను రక్షిస్తుందని అమీర్ ఎంతో ఆశపడ్డాడు. ఈ గండం తప్పుతుందనుకున్నాడు. ఆతని సైన్యం క్రమేణా క్షీణించి పోతూంది. ఆతని సైనికులు, కడుపునిండా కూడు, ఒంటినిండా బట్టలేక పోవడం చేత సైన్యాన్ని వదలిపోనారంభించారు. ఎర్రసైన్యం కోల్‌ఛక్, డెనికిన్‌లను ఓడించి టుర్కిస్థాన్‌తో సంబంధం కలుగజేసుకుంది. ఈ విషయమంతా విన్నాడు అమీర్. పాపం ఆతని రాతిగుండె నీరై పోయింది.

## సోవియట్ పుట్టుక

బొఖారాలో ఆర్థిక జీవనం విచ్ఛిన్నమయ్యే స్థితి ఏర్పడ్డది. రైతులు కష్టాల కోర్చుకోలేక పోయారు. స్థానిక విప్లవకారులు సాయుధ తిరుగుబాటును సాగించ నిశ్చయించి కొన్ని నగరాలను వశపర్చుకున్న తర్వాత బొఖారావైపు దాడి సాగించారు. బొఖారా నగరవాసులు తమ నగరాన్ని వదలి పరిగెత్తి వెళ్ళారు. నగరం

పాడుబడుస్థితి ఏర్పడింది. ఈ ముఖ్యపట్టణాన్ని ఎర్రసైన్యం ముట్టడించింది. అమీర్ ఓడిపోయాడు : కాలికి బుద్ధిచెప్పాడు. ఈవిధంగా విప్లవ చరిత్రకు మరో నూతన అధ్యాయం చేర్చబడింది. ప్రజాప్రతినిధులు సమావేశమై "ప్రజాసోవియట్"ను ఏర్పాటు చేశారు. 1921 మార్చిలో ఈ "నూతన బొఖారా సోవియట్ ప్రజాస్వామ్యం" "రష్యన్ సోవియట్ ప్రజాస్వామ్యాల సామ్యవాద ఫెడరేషన్"తో సైనిక, ఆర్థిక ఒడంబడిక చేసుకుంది. "ప్రపంచ పెట్టుబడిదారి వర్గం, దానికీలు బొమ్మల ఆపులేని విచ్ఛిన్న ప్రయత్నాలనుంచి సోవియట్లను రక్షించను" ఈ రెండు సోవియట్లు ఏకమైనవి. కాని బొఖారా ప్రజాస్వామ్యం రష్యను ఫెడరేషన్‌ను చేరింది కాదు. మునుపటి సంఘ నిర్మాణం శిథిలమైంది. పునర్నిర్మాణం చాలకష్టంగా కనపడింది. పునర్నిర్మాణ సమస్యను గురించి వ్యత్యస్త భావాలేర్పడినవి. కష్టించేవారందరి తిరుగుబాటు ఫలితంగా ఈ విప్లవం జయంపొందింది గనుక దీనిని కేవలం కార్మిక విప్లవమనికాని, ధనికవర్గ విప్లవమనికాని అనడానికి లేదని బోల్షివిక్కులు వాదించారు. కాని, సోవియట్లు వెంటనే చేయవలసిన కర్తవ్యం భూమిని మరల పంచడమేనని వీరి వాదము.

ఈ మధ్యకాలంలో మధ్య ఆసియా అంతటా సోవియట్ పరిపాలన అధిక బలాన్ని, హెచ్చు పలుకుబడిని సంపాదించింది. అమీర్ బంట్లు ఈ విషయాన్ని గ్రహించి రైతులను తమవైపు మరల్చుకోవడానికి ప్రయత్నించారు. ఇద్దరు మహమ్మదీయ నాయకులు – ఇబ్రహీంబెక్, అన్వర్‌పాషా – ముందుకురాగానే బోల్షివిక్కుల జయించడం అతి సులభమనుకున్నారు, అమీర్‌బంట్లు. ఇబ్రహీంబెక్, అన్వర్‌పాషా బోల్షివిజంమీద మత యుద్ధాన్ని (ఇస్లాం) సాగించారు. గడచిన యుద్ధంలో (1914-18) కమాల్ పాషాకు ఎదిరియైన అన్వర్‌పాషా సోవియట్ రష్యాకు పారిపోయాడు. అఖండమైన తెలివి తేటలుగలవాడు గనుక తాను బోల్షివిస్టుగాకున్నా సోవియట్‌నాయకుల నమ్మకాన్ని చూరగొన గల్గాడు. తనదురుద్దేశం బయల్పడకుండా బోల్షివిక్కులపట్ల అతి వినయంగా ప్రవర్తిస్తూ, తాను రష్యాలో నుండియే మహమ్మదీయ దేశాల్లోని రహస్య ఉద్యమాలను నడిపించాడు. సోవియట్ అధికారులు ఈ విషయాలన్నిటినీ గ్రహించేటప్పటికి మధ్య ఆసియాలోకి పలాయనమైనాడు. తాను "ఇస్లాం"ను రక్షించ పూనుకున్నట్లు ప్రకటించి ఉజ్‌బెకిస్థాన్, టడ్‌జికిస్థాన్, కజకిస్థాన్‌లలోని మహమ్మదీయుల ఐక్యపరచ నారంభిం

చాడు. "ఆధునిక" మధ్య ఆసియా రాష్ట్రాన్ని నిర్మించాలని ఆశపడ్డాడు. కాని పరిస్థితులు క్లిష్టంగా ఉన్నాయి. అంత్య విజయం చాల దూరాన ఉన్నట్లగుపడింది. విప్లవ - విరోధుల సైన్యంలో అన్నిరకాల ప్రజలూ చేరారు. వారి ప్రభుభక్తి అనుమానకరమైంది. విప్లవం ముందుకు సాగనారంభించింది. ఈ నడకను యెవ్వరూ ఆపలేక పోయారు. రైతులలో పేదరికం అపరిమితంగావుంది. వారు బస్మాచీని సహించలేక పోయారు. ఎర్రసైన్యం ఉన్న విడిదికి వచ్చిన రైతు రాయబారాలన్నీ కూడా ఈ బందిపోటు దార్లను రూపుమాపాలసిందని కోరినవి. జయం సులభంగా కలిగే ఆశలేనందున, నిరాశాపూరితుడై ఇబ్రహీంబెక్ గుఱ్ఱంమీద స్వారీచేస్తూ గుఱ్ఱంతోగూడా అమాంతం నదిలోకురికి ఆత్మహత్య చేసుకున్నాడు. రహస్య సమావేశాన్ని జరుపుతూన్నప్పుడు అన్వర్‌పాషా కాల్చివేయబడ్డాడు. ఇంతటితో బొఖారా విప్లవంయొక్క రెండవ అధ్యాయంకూడా ముగిసింది. సోవియట్ ప్రభుత్వం తాను పునర్నిర్మాణాన్ని సాగించగల స్థితికి వచ్చింది. పత్తి పండించే భూవిస్తీర్ణం 100% పెరిగింది. 1929 లో వ్యవసాయ ఫలితం మొత్తం వెల షుమారు రూ. 6,75,00,000. వ్యవసాయపు నీటి వసతులన్నిటిని సోవియట్ ప్రభుత్వం మరమ్మతు చేసింది. ఈ నీటి వసతుల నభివృద్ధి పరచను షుమారు రూ. 30,00,000. వెచ్చించింది.

"స్వయం నిర్ణయహక్కు" ఇవ్వబడుతుందన్నవాగ్దానం ప్రజాహృదయాన్ని చూరగొన్నది. విముక్తి ఎప్పుడు కల్గుతుందా అని ప్రజ ఎదురుచూస్తూన్నారు. ఈ ప్రజలందరు మహమ్మదీయులేకాని వారిలో వారికి సంఘీభావంలేక ముఠాలు - ముఠాలుగా చీలియున్నారు. వారిలో బందిపోట్లూ, సరిహద్దుల కలతలూ ఎక్కువగా నుండేవి. అందువలన "అల్పసంఖ్యాకులైన జాతుల సమస్య" సోవియట్ ప్రభుత్వాన్ని కార్యనిర్వహణకు బలవంత పరచింది. అప్పటి కష్టపరిస్థితులను పరిమార్చను జాతులన్నీగూడ ఒక సమావేశానికి - బొఖారాలో - ఆహ్వానింపబడ్డవి. 1924 లో జరిగిన "అఖిల బొఖారా కాంగ్రెస్" ఈ క్రింది తీర్మానాన్ని ఆమోదించింది. —

"అన్ని జాతుల శ్రామిక వర్గాలు తమ ఆర్థిక, రాజకీయ అభివృద్ధిని సాధించనూ, సంస్కృతిక - జాతీయ నిర్మాణానికి పాటుబడనూ, సోవియట్ సిద్ధాంతాల ననుసరించి జాతీయ అభివృద్ధి అవుసరం. ఇందుకు అన్ని

జాతుల శ్రామికవర్గాలు సంయుక్తపరచబడిన సోవియట్ భూమిపై ఐక్యమై నిలబడాలి."

ఇలాంటి ఉత్సాహంతో, పై ఆశయాల సాధించను బొఖారా అంతట జాతియోద్యమం వ్యాపించింది. శ్రామికులలో హెచ్చుమంది జాతీయోద్యమాన్ని చేరారు. వేరు వేరుగావున్న ప్రాంతాలన్నిటినీ ఒక జాతీయ రాష్ట్రంగా ఐక్య పరచడం, ఈ జాతులన్నిటికీ స్వతంత్ర సోవియట్‌రాష్ట్ర పరిపాలనా ఫలితాల నందచేయడం- ఈ రెండు కోర్కెలతో అందరూ పనిచేశారు. బొఖారా సోవియట్‌కు చెందకున్నా, పరిసర ప్రాంతాల్లోనున్న ప్రజలుగూడ ఈ ఆశయాలకు తోడ్పడ్డారు. బొఖారా, తుర్కిస్తాన్, ఖోర్‌జమ్‌లలోని శ్రామిక జనమంతాగూడ పై ఆశయాలకు పాటుపడ్డారు.

శ్రామికుల కోర్కెలు, ఆశయాలే సోవియట్ రాష్ట్రంయొక్క న్యాయశాస్త్రం. అందువలననే అఖిల బొఖారా సోవియట్ కాంగ్రెస్, తన ఐదవ సమావేశంలో, ఈవిధంగా ప్రకటించింది. —

(1) బొఖారా ప్రజలైన ఉజ్‌బెక్కులు, టడ్జిక్కులయొక్క ముఖ్యోద్దేశం తాము తుర్కిస్తాన్, ఖీరెజమ్ ప్రజలతో కలసి ఉజ్‌బెక్ సామ్యవాద సోవియట్ ప్రజాస్వామ్యాన్ని స్థాపించడమే. ఇందులో నొకభాగం అధినివేశప్రతిపత్తి గల టడ్‌జక్కుల ప్రాంతమై ఉంటుంది.

(2) బొఖారాకు చెందిన తుర్కొమన్ ప్రజలతో సమాధానం కుదుర్చుకోడం, వారు మేము కలసి తుర్కొమన్ సామ్యవాద సోవియట్ ప్రజాస్వామ్యాన్ని స్థాపించడం.

(3) సామ్యవాద ఉజ్‌బెకిస్తాన్, తుర్క్‌మని స్తాన్‌లు సామ్యవాద నిర్మాణం కొరకు, సామ్రాజ్యవాదంనుండి రక్షణ కొరకు శ్రామికుల అంతర్జాతీయ ఐక్యత ననుసరించి సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్య సంయుక్త రాష్ట్రంతో చేరడం.

ఇతర ప్రజాస్వామ్యాలుగూడ ఈ మార్గాన్నే అవలంబించి ఈ విధంగా ప్రకటించినవి — "చెమటకారా కష్టపడే ప్రజల ఇష్టమే ఉత్తమోత్తమమైన న్యాయశాస్త్రం —

చట్టమూను." ఉజ్‌బెక్, తుర్కొమన్ రాష్ట్రాలు స్థాపించబడినాయి. ఈ నూతన రాష్ట్రాలు సోవియట్ సంయుక్తరాష్ట్రంలో సభ్యతను బొందినవి.

ఈ విధంగా స్వయం నిర్ణయమన్న చారిత్రాత్మక కర్తవ్యం పూర్తిచేయబడి పూర్వపు లోటుపాట్లు సరిపరుప బడినవి. తర్వాత ఈ రెండు ప్రజాస్వామ్యాల్లోని టడ్‌జిక్ భాగాలు రెండూ ఐక్య పరుపబడి టడ్‌జికిస్తాన్‌గాను, ఉజ్‌బెక్ భాగాలు రెండూ కలసి ఉజ్‌బెకిస్తాన్‌గాను ఏర్పడినవి. నేడు సోవియట్ మధ్య ఆసియా నాలుగు యూనియన్ ప్రజాస్వామ్యాలు, ఒక అధినివేశ ప్రజాస్వామ్యం వరకు వ్యాపించి యున్నది.

మధ్య ఆసియాలోని జాతీయ జీవితం ఎలా పునర్నిర్మింప బడినది చదువు చున్న అత్యాశ్చర్యమేస్తుంది. సోవియట్ ప్రభుత్వం నెరవేర్చిన ప్రధమ కర్తవ్యం పత్తి ఉత్పత్తిని క్రమపరచడం. "పత్తి — సమితి" నొకదానిని ఏర్పాటుచేసి నీటి సరఫరా, ఎరువులు, విత్తనాలు మొదలైన కార్య క్రమాన్ని ఈ సమితికి ఒప్ప గించింది. తద్వారా పత్తి ఉత్పత్తి ఎక్కువైంది. 1924 లో పత్తి పైరుచేయబడిన భూమి విస్తీర్ణం 11,17,500 ఎకరాలు మాత్రమే. 1930 లో ఈ విస్తీర్ణం 40,80,000. ఎకరాలకు పెరిగింది. పత్తి చేలల్లో పనిచేసేవారికి రోజుకు రూ. 2/- కూలీ యిచ్చేవారు. ఇంతకు తగ్గిన కూలీ లేనేలేదు. ఈ పనివారికి కొన్ని సౌక ర్యాలుగూడా ఏర్పరుపబడ్డవి. వీరికి నివాసస్థలాలు, తేనీరు, రెండు రొట్టెముక్కలు, మధ్యాహ్న భోజనం - ఇవన్నీ ఉచితంగా ఇవ్వబడేవి. ఈ సౌకర్యాలన్నీ సోవి యట్ ప్రభుత్వం తన పరిపాలనను ప్రారంభించిన రోజుల్లో ఏర్పాటుచేసింది. సామ్యవాద నిర్ణీత విధానం ప్రజల జీవితాన్ని మార్పుచేయను తగిన ఆయుధమని ఋజువుచేయను ఈ ఒక్క నిదర్శనం చాలు. అమెరికాలోని పత్తిని పండించే రైతుల జీవితంతో (1930 లో) పోల్చిన సామ్యవాదంయొక్క అత్యున్నత స్థితి స్థిరపడినట్లే. —

"దక్షిణ అమెరికాలో పత్తి విత్తేవారు, కౌలుదార్లు (వీరు నీగ్రోలుగాని, తెల్ల వారుగాని) బానిసత్వంలో నివసిస్తున్నారు. వీరిలో ఎంతో మెరుగ్గావున్న వారిని మాత్రమే లెఖ్కకు తీసుకున్నా వీరి జీవితం నికృష్టమనే అనాలి.... వేనవేలు కౌలుదార్లు కొద్దివారాల అనావృష్టి ఫలితంగా కూటికి లేక మాడి,

పిదప దుకాణాల దోచుకోడానికో, లేక రెడ్‌క్రాస్‌వారి ముష్టిని అందుకోడానికో సిద్ధమౌ తున్నారు........సామాన్య కౌలుదారుడు నిరక్షరాస్యుడు. బాహ్య ప్రపంచాన్నెరుగడు. ఎన్నడూ ప్రయాణం చేసినవాడు కాడు. చేత డబ్బులేదు. కట్టుకోను ఒంటినిండా బట్టలేదు. పేరుకు రైతే కాని బండీ, మొండీ ఏదీ లేదు. మరోపని చేతకాదతనికి - మరో ఉద్యోగం చూపే వారు లేరు." *

ఇక్కడి కొద్దిపాటి భూస్వాములను బేస్ అంటారు. వీరిసౌఖ్యానికి కారణం భూమి అసమానంగా పంచబడడమే. కనుక, బొఖారాలోని దుర్భర పరిస్థితులను తొలగించను వ్యావసాయక విప్లవం తప్ప వేరుమార్గం కనబడలేదు. బొఖారాలోని విప్లవకారు లందులకు సిద్ధపడ్డారు. ఈ సంస్కరణయొక్క ముఖ్య ఆశయాలు — (1) అధికారంపైనుంచి చెలాయించబడడం, (2) నిర్ణయాలన్నీ రైతులనుండే రావలసియుండడం, (3) బోల్షువిక్కుల నాయకత్వాన రైతులు సమీకరింపబడడం.. భూమి పంపకం ప్రథమంలో ఉజ్‌బెకిస్తాన్‌లో ప్రారంభింప బడ్డది. ముల్లాలు, బేస్‌లు ఎదిరించారు. బేస్‌లకు తర్వాత అప్పటి విధానాన్ని నిలబెట్టడంలో ఎక్కువ ఆసక్తి ముల్లాల కున్నది. కాని ముల్లాలలోనే రెండు తెగలేర్పడినవి. ముల్లాలలో పేదవారైనవారు రైతులతో చేరారు. క్రమేణ తిరుగుబాటుదార్లు మెత్తబడ్డారు. భూమి రైతులకు పోయింది. భూమి పంచబడడంవల్ల రైతులు సుఖపడ్డారు. కాని భూమి లేని రైతులు చాలామంది మిగిలారు. వీరికి జీవనాధారం చూపవలసిన బాధ్యతను సోవియట్ ప్రభుత్వం వెంటనే ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ సమస్యను పరిష్కరించను వ్యవసాయాన్ని పెంపొందించడం తప్ప వేరుమార్గం లేదు. అందుకనే ప్రభుత్వం మర నాగళ్ళను ఉపయోగానికి తెచ్చింది. మధ్య ఆసియా సోవియట్ ప్రభుత్వ పరిపాలనలో ఈ ద్వితీయాంకం 1929 లో ప్రారంభమైంది. ఈ ప్రయత్నా లన్నిటి ఆశయం సామ్యవాద స్థాపనే. పల్లీయులు మర నాగళ్ళనుచూచి ఆరంభంలో బెదరిపోయారు. వ్యవసాయానికి మరల నుపయోగించకూడదని ముల్లాలు మళ్ళీ ఎదురు తిరిగారు. ముల్లాలు అబద్ధ ప్రచారాన్ని ఆరంభించారు —

* 16-12-1931 న న్యూయార్క్ నగరంనుంచి వెలువడిన "ది న్యూ రిపబ్లిక్" అన్న పత్రికలో వాల్టర్ విల్‌సన్ వ్రాసిన "పత్తి పంట" అన్న శీర్షిక నుండి.

"మర నాగళ్ళతో దున్నబడిన చేలలో పంట పండదు. మరనాగళ్ళు నడవ డానికి అవసరమైన గ్రీజు పందులు, మొదలైన అశుభ్ర జంతువుల కొవ్వు నుండి చేయబడినది. గనుక మహమ్మదీయుడైనవాడు మరనాగళ్ళను అంటరాదు."

మర నాగళ్ళతో దున్నబడిన చేలు ఎక్కువ పంట నివ్వడంచూచి విరుద్ధప్రచారం దానంతట అది సమసిపోయింది. 1930 లో మధ్య ఆసియాలోని చేలల్లో 5,000 మరనాగళ్ళు పనిచేశాయి. ఈ ఆధునిక వ్యవసాయ విధానానికి మరనాగళ్ళ కేంద్ర స్థానా లెక్కువగా సాయపడినవి. ఈ స్థానాలు మరనాగళ్ళను సరఫరాచేయడం, వాటిని మరమ్మతు చేయడం మొదలైన విషయాలగురించి శ్రద్ధవహించినవి. వ్యవసాయాభివృద్ధితోపాటు "పత్తి సహకారసంఘాలు" ఏర్పడినవి. 1930 లో ఈ సహకార సంఘాల శాఖలు 2,000 మధ్య ఆసియాలో పనిచేశాయి.

"పత్తి సహకారసంఘాలు" రైతుకు ఆర్థిక సంస్థలతో సంబంధం కల్గించి నవి. తద్వారా రైతులు నూతన జీవితాన్ని ఎలా గడపవలెనని నేర్చుకున్నారు. శతాబ్దాల అభివృద్ధిని సంవత్సరాల్లో దాటగలిగారు. మధ్య ఆసియా జమీందారీ విధానం నుండి సరాసరి నిర్మాణ సామ్యవాద యుగాన్ని ప్రవేశించింది. మధ్య ఆసియా వ్యక్తిగత జీవితాన్నుండి సమిష్టి జీవిత విధానాన్ని ప్రవేశించింది.

విప్లవానికి పూర్వం అమీర్ పరిపాలనప్పుడు అతని ప్రజల్లో 2% మాత్రమే అక్షరాస్యులుగా నుండేవారు. మొత్తరీ 12,00,000. జనాభాలో 6,000. మాత్రమే అక్షరాస్యులు. 1929 లో 500 పాఠశాలలు, వానిలో 2,84,000. విద్యార్థులు ఉన్నారు. 1931 లో పాఠశాలల సంఖ్య 900 కు పెరిగింది. పాఠశాలల్లోని చిన్న పిల్లల సంఖ్యమాత్రం 58,000. అప్పటినుంచి అభివృద్ధి ముందునకు నడుస్తూనే ఉంది. అమీర్ పరిపాలనా కాలంలో "ప్రజారోగ్యం" గమనింపబడేదే కాదు. మలేరియా జ్వరం, కుష్టురోగం ఎక్కడ బట్టినా తాండవమాడేవి. ఎక్కడ వెతకినా ఆస్పత్రి కనబడేది కాదు. తాయిత్తులు, రక్షలు తప్ప వేరువిధమైన చికిత్సలే దారోజుల్లో. 1931 లో టడ్జెకిస్తాన్‌లో మాత్రమే 16 ఆస్పత్రులు, 2,000 మంచాలతో ఉన్నాయి. విప్లవానంతరం ఏర్పడ్డ ఉప్పెనరోజుల్లోగూడ సోవియట్ సంయుక్తరాష్ట్రం సాధించగల్గిన మహత్కార్యాల కొద్దిపాటి ఉదాహరణలివి.

## ఉజ్‌బెక్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం

జనాభాలోను, ఆర్థిక శక్తిలోను ఉజ్‌బెక్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం మధ్య ఆసియాలోకి ప్రపథమమైంది. వ్యవసాయపు నీటి సరఫరా ఈ ప్రజాస్వామ్యంలో హెచ్చుగా వుంది. సోవియట్ సంయుక్తరాష్ట్రం మొత్తం పండించే పత్తి పంటలో మూడింట రెండుపాళ్ళు ఈ ప్రజాస్వామ్యం మాత్రమే పండిస్తూంది. ఈ ప్రజాస్వామ్యానికి ముఖ్యపట్టణం టాష్‌కెంటి. ఈ నగరం ఎడారి నడుమనుండు ఫలవంతమైన ఒక ప్రదేశంలో నున్నది. ఈ పట్టణానికి కాలువల మూలంగా నీరు సరఫరా చేయబడుతూన్నది. వేసవిలో వానలు లేవు. మేఘమే అగపడదు, కాని ఎండ అంత తీక్ష్ణంగా వుండదు. రాత్రులు చల్లగా ఉంటాయి. ఈ నగరం పాత, కొత్త అని రెండు భాగాలుగావుంది. కొత్తనగరం అతి జాగ్రత్తతో నిర్ణయాన్ని అనుసరించి నిర్మింపబడి ఉంది. వీధులు సిమెంటు రోడ్లతో, విద్యుద్దీపాలతో నిండి ఉన్నాయి. టాష్‌కెంట్ నగరాన్నిచుట్టి ముఖ్యమైన పరిశ్రమలున్నాయి. సోవియట్ పరిపాలనా కాలంలో ఉజ్‌బెకిస్తాన్ పారిశ్రామిక ఉత్పత్తి ఐదింతలు పెరిగింది. శ్రామికుల కూలీలు ఒకటికి రెండైనవి.

ఉజ్‌బెకిస్తాన్‌లో ముఖ్య ఉత్పత్తి పత్తి. దీనితోబాటు ఇతర పరిశ్రమలు గూడ ఉన్నాయి. పత్తి చేలకు తగిన ఎరువులను సరఫరా చేయను టాష్‌కెంట్‌లో గొప్ప విద్యుచ్ఛక్తి - రసాయన యంత్రశాల ఒకటుంది. ఇటీవల టాష్‌కెంట్ సంస్కృతికి కేంద్రమౌతూ ఉంది. సాంకేతిక విద్యాశాలలు ఈ పట్టణంలో అనేకమున్నాయి. వీటిలో ఇంజనీర్లు, వైద్యులు, ఉపాధ్యాయులు తరిఫీదు బొందుచున్నారు. అచ్చటి దేశభాషలో పుస్తకములు, వార్తా పత్రికలు అచ్చౌతూన్నవి. ఉజ్‌బెక్ వార్తా పత్రికలు రోజూ 1,00,000 పైగా కాపీలు ఖర్చౌతున్నవి.

ఫెర్గానాలోయలో లోహాలు సమృద్ధిగా ఉన్నాయి. ఎరువుల సహాయంతో కొండలనుగూడ సారవంత పరచి వాటిమీద పత్తిని పండిస్తున్నారు. ఫెర్గానా నగరంలో పత్తి మిల్లులు, పట్టు మిల్లులు, నూనెయంత్రాలయాలు ఉన్నాయి. బొఖారా, సమర్ఖండ్ దేశాలు రెండూ ఎడారిమధ్యలో వున్నవి. కొన్ని శాతాబ్దాలకు పూర్వం మధ్య ఆసియా అంతటికి బొఖారా ముఖ్యపట్టణంగా నుండేది. తైమూర్‌లేన్ ఆధిపత్యమప్పుడు సామర్‌ఖండ్ ఒక వెలుగు వెలిగింది. సోవియట్ మధ్య ఆసియా

లోని ఎడారులు, ఎడారుల నడుమనుండు ఫలవంతమైన ప్రదేశాలకు లొంగిపోయినవి. విప్లవానికి పూర్వం పైరులకు నీటి సరఫరా సక్రమంగా నుండేదికాదు. నీరు కావలసినంత దొరికేదికాదు. అంతర్యుద్ధం రోజుల్లో నీటి సరఫరా కాలువలు ధ్వంసంచేయ బడినవి. వాటిలో కొన్ని పూడిపోయినవి. అందువలన సోవియట్ ప్రభుత్వం ఈ కాలువలను మరమ్మతు చేయవలసి వచ్చింది. సిమెంటుతో ఆనకట్టలు కట్టబడ్డవి. మైళ్ల పర్యంతం వ్యాపించిన కాలువలు త్రవ్వబడ్డవి. ప్రస్తుతం ఈ ప్రాంతమంతాగూడా శాఖోప శాఖలుగా చీలియున్న నీటి సరఫరా విధానం మూలంగా కావలసినంత నీటి వసతిని కలిగియున్నది. నీటివసతి హెచ్చినది గనుక మలేరియా బీజాలు నశించి పోయినవి. దోమలుగూడ అంతరించాయి.

పూర్వం నీటి సరఫరా బేస్‌ల సొంత ఆస్తిగా నుండేది. తద్వారా వారు రైతులను దోచుకునేవారు. సోవియట్ ప్రభుత్వం నీటి సరఫరా నంతటినీ రాష్ట్రసొమ్ముచేసింది: కష్టపడి పనిచేసే రైతుల పరమైనవి నీటి సరఫరాలు. నీటిసరఫరా అతి త్వరితంగా అభివృద్ధి చెందడంతో పత్తి పంట స్వతంత్రించింది. ఇంతకు పూర్వం పత్తి సరఫరాకు రష్యా అమెరికామీద ఆధారపడి ఉంఢేది. ప్రస్తుతం సోవియట్ సంయుక్తరాష్ట్రానికి విదేశాల సరఫరా అనవసరం. మధ్య ఆసియా భూములకు కావలసినంత ఎరువు, నీరు దొరుకుతూన్నవి గనుక మంచి పంట పండించబడుతూంది. ఉజ్‌బెకిస్తాన్‌లో పత్తిని పండించే భూమి విస్తీర్ణం రెండింతలకు పెరిగింది. 1938 లో సగటున ఎకరానికి 585 పౌన్లు పత్తి పండింది. వ్యవసాయానికి నూతన పనిముట్లను వుపయోగించడంవల్ల ఈ మార్పు కలిగింది.

## తుర్క్‌మేనియన్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం

ఉజ్‌బెక్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యానికి పడమరగా తుర్క్‌మేనియన్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యమున్నది. జారులకాలంలో తుర్క్‌మేనియా కేవలం వలసరాజ్యంగా నుండేది. జనులు నిరుపేదలు. ప్రస్తుతం ఇచ్చటి ముఖ్యమైన పంట పత్తి. ఈ పంట పూర్వంకన్నా ఇప్పుడు రెండింతలు పండించుచున్నారు. నీటి సరఫరా అభివృద్ధి చెందినందున పంట రెండింతలు పండుచున్నది.

ఖైజోవ్‌కు పైగా కారా - కూమ్ ఎడారి వ్యాపించి యున్నది. ఈ ఎడారి నేలాగైనా జయించ పూనుకున్నారు సోవియట్ వైజ్ఞానికులు. ఎడారి ఇసుకలో దిగబడని వెడల్పాటి మోటారు టైర్లను కనిపెట్టారు. ఈ టైర్లను తగిలించుకున్న కార్లలో ఎడారులన్నిటినీ చుట్టిరావచ్చు. ఇటీవల కొన్ని ఎడారులకు నీటి వసతి కల్గించారు. ఎడారులు అతి విశాలమైనవి గనుక కరగిన మంచునుండీ, కొండల మీద పడ్డ వర్షమునుండీ లభించే నీటి సరఫరా వీటికి చాలదు. ఈ సమస్య పై సోవియట్ వైజ్ఞానికులు పరిశోధనలు చేశారు. ఇసుకమయమైన ఈ ఎడారులు నిర్జీవమైనవి కావు. చలికాలంలోని మంచు, వర్షఋతువులోని వాన అందుగల చెమ్మను ఇసుక పీల్చుకుంటూంది. కాని ఈ చెమ్మను వేడిపరచి పైకి పంపలేకుండా ఉన్నది. ఇసుకకింద కొంత మంచినీటి ఉరవడి ఉండనే ఉంది. అందుకనే ఇసుక ఎడారిలో పెరగడానికి చెట్లకు పొడవైన వ్రేళ్ళు కావాలి. పశువుల మందలు ఈ ఇసుకలో తమ పాదచిహ్నముల నేర్పరచినప్పుడు ఈ గుర్తులలో అక్కడక్కడ పచ్చిక మొలవడం కద్దు. అందువల్ల ఎడారిని పచ్చిక బయలుచేసితే పశువుల మేపను వీలున్నది.

ఎడారులను వ్యవసాయపు భూములుగా, పశువుల మేపను పచ్చిక బయళ్ళుగా మార్చారు. ఇల్లని, వాకిలని లేకుండా పశువుల మేపుకుంటూ దేశ దేశాలు తిరుగుతూ వచ్చినవారిప్పుడు స్థిర నివాసాలేర్పరచుకుంటున్నారు. ఎడారిమధ్య సాంస్కృతిక కేంద్రాలు తలచూపుతూన్నవి. ఉన్నత పాఠశాలలు, శిశుపోషణ శాలలు, టెలిఫోన్ సౌకర్యాలు, ఉద్యాన వనాలు అంతటా ఏర్పడ్డవి. ఎడారితో యుద్ధం కష్టతరమైనప్పటికీ మానవునికి తత్ఫలితం కూడుబెట్టింది.

తుర్క్‌మేనియాలో ముఖ్యమైన నగరం అష్ఖాబాద్. ఈ నగరంచుట్టూ ముఖ్యమైన పరిశ్రమలు వ్యాపించాయి. అష్ఖాబాద్‌కు దూరంలో గంధకపు పరిశ్రమ నెలకొల్పబడ్డది. కొన్ని ఏండ్లక్రితం ఈ పరిశ్రమ ఇసుక ఎడారిలో స్థాపింపబడ్డది. ప్రస్తుతం ఈ పరిశ్రమ అపారంగా ఉత్పత్తి సాగించుతూవుంది. సోవియట్ సంయుక్తరాష్ట్రం ప్రస్తుతం గంధకాన్ని దిగుమతి చేయవలసిన అవసరమే లేదు. తుర్క్‌మేనియా రత్నకంబళ్ళు ప్రపంచఖ్యాతిగాంచినవి. ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధమపుడు (1914-18) ఈ పరిశ్రమకు కావలసిన రసాయనికపు, అద్దకపు రంగులు దొరకనందున క్షీణింప నారంభించింది. సోవియట్ ప్రభుత్వం అద్దకపు

రంగుల నుత్పత్తిచేసే యంత్రాలయాలను నెలకొల్పింది. ఈ పరిశ్రమలోని గ్రామికులనుగూడ సహకార సంస్థలలో చేర్చింది.

అమీర్ పరిపాలనాకాలంలో ఇచ్చట విద్యాగంధం చాల తక్కువ. ఇచ్చటి భాషలో గ్రంథ ప్రచురణ లేనే లేదు. ఈ దేశమంతటా తొమ్మండుగురు వైద్యులు, ఇర్వురు విద్యార్థినులు ఉండేవారు. నేడు ఈ దేశంలో 4 విశ్వవిద్యాలయాలు, 5 నాటకశాలలు, 1 సినిమా స్టూడియో (చలనచిత్ర ఉత్పత్తికేంద్రం) ఉన్నాయి.

## ఖిర్‌గిజ్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం

ఖిర్‌గిజ్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం మధ్య ఆసియాలో తూర్పు భాగంలో వుంది. ఇచ్చటి ప్రజలు తుర్కీ జాతికి చెందినవారు. కొద్దికాలంక్రితం వరకు వీరు అనాగరికులు. నేరస్థుణ్ణి ప్రాణంతోనే పాతిపెట్టేవారు. లేకుంటే, మదించి, మానవునికి లొంగని గుఱ్ఱం తోకకు కట్టేవారు. కాని ఖిర్గీజ్ ప్రజ నానాటికి క్షీణించి పోతున్నది. 1903-1913 మధ్యగల 10 ఏండ్లలో వీరి జనాభా 10% తగ్గింది. ఇందుకు కారణం కావలసినంత ఆహారం లేకపోవడమూ, రోగాలునూ. విప్లవం వీరికి ప్రాణాల నిచ్చింది - స్వాతంత్ర్యాన్ని తెచ్చింది. ప్రస్తుతం చావుల రేటుకు రెండింతలు పుట్టుకరేటయినది.

జారుకాలంలో ప్రజలలో 2% మాత్రమే చదువుకున్నవారు. ఇచ్చటి భాష వ్రాయబడేదిగాదు. కేవలం మాట్లాడ్డానికి మాత్రమే ఉపయోగపడేది. సోవియట్ ప్రభుత్వం నూతనవర్ణ క్రమాన్ని ప్రవేశపెట్టి భాష నభివృద్ధి పరచింది. 1938 లో విశ్వవిద్యాలయాలలోను, సాంకేతిక పాఠశాలలలోను చదువుతూన్నవారి సంఖ్య 5,000. ఖిర్గీజ్ ప్రజలు స్థిరనివాసులుగారు. సోవియట్ ప్రభుత్వం స్థిరనివాసాలేర్పరచి వారిని నూతన జీవితంలోనికి దింపింది. ఈ స్థిర నివాసాలకు రాష్ట్రమే పెట్టుబడి పెట్టింది. ఖిర్గీజ్ ప్రజలు సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో పనిచేస్తున్నారు. ఈ ప్రజ లింతకుపూర్వం జీవితంలో రెండే రెండుమార్లు స్నానం చేశేవారు - పుట్టగానే, గిట్టగానే. వ్యావసాయక గ్రామాల్లోగూడ ఇప్పుడు స్నానానికి సౌకర్యాలూ, వైద్యశాలలూ ఏర్పడ్డవి.

ఛూ లోయకు నీటివసతి కలుగజేసి ఒకవిధమైన జనుమును పండిస్తున్నారు. దీనినుంచి త్రాళ్లు, పగ్గాలు, గోనెసంచులు నేయబడుచున్నవి. తియ్య గనుసుగడ్డ

ఎక్కువగా పైరుచేయబడుతూంది. అన్ని దేశాలకంటే ఎక్కువగా ఖిర్గీజ్ తియ్య గనుసుగడ్డను వుత్పత్తి చేస్తూంది. ఈ ప్రజాస్వామ్యానికి ముఖ్యపట్టణం చూ లోయలో వున్నది. ఈ పట్టణంచుట్టూ నీలిమేఘాల నంటుతూన్న. మంచుతో కప్పబడిన పర్వతా లున్నాయి. ఈ పట్టణం మధ్య పూలచెట్లతో నిండిన అతి సుందరమైన ఉద్యానవనంవుంది. దారుల నానుకొని ఇరువైపుల పొడవైన పోకచెట్లున్నాయి. చుట్టు పక్కల గ్రామాల్లో పరిశ్రమలు నెలకొల్పబడ్డవి - నేత పరిశ్రమ, పొగాకు ఫాక్టరీ, తోలు ఫాక్టరీ. ఈ పట్టణం నానాటికి పెరుగుతునే వుంది.

## టడ్జిక్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం

మధ్య ఆసియాలో ఆగ్నేయ మూలన టడ్జిక్ సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్య మున్నది. టడ్జికులు పూర్వకాలంనుంచి వ్యవసాయదారులు. స్థిరనివాసాలు లేకుండా తిరుగుతూ వచ్చిన మొరటుజాతులవారు అనేక శతాబ్దాలకు పూర్వం వీరిని సమతల ప్రదేశాలనుండి పర్వతములకు తరిమారు. వీరు పర్వతాలమీదే వ్యవసాయాన్ని ప్రారంభించారు. టడ్జికిస్థాన్ లోయలలో వ్యవసాయ నీటి సరఫరా కాలువ లుండేవి. శతాబ్దాల తరబడిని మానవశ్రమ కష్టించి ఈ కాలువలు కట్టించింది. ఈ కాలువ చాల్లు ఎక్కువ లోతు లేనందున క్రమేణా ఈ కాలువలు పూడిపోయినవి. ఈ కాలువలు నీటిని సరఫరా చేసిన భూములలో పత్తి, పండ్లు, వరి పండించబడేది. ఈ నీటి సరఫరాను వుపయోగించుకున్నందుకు అమీర్ రైతులపై అన్యాయపు పన్నుల విధించేవాడు. అందువలన టడ్జికిస్తాన్ నిరుపేదల దేశమైంది. విప్లవం వారికి భూమిని, నీటిని సంపాదించి యిచ్చింది. ప్రస్తుతం ఈ భూములలో "ఈజిప్టు పత్తి" అపారంగా పండుతూ ఉంది. సమిష్టి వ్యవసాయ పద్ధతి అచ్చటి రైతు బిడ్డలకు సుఖజీవితాన్ని సమకూర్చింది.

1926 లో టడ్జికిస్తాన్ ప్రజలలో 90% నిరక్షరాస్యులు. 1929 లో 16,000 మంది విద్యార్థు లేర్పడ్డారు. ప్రపంచంలో ఏం జరుగుతూంది తెలుసుకోడానికి ఇచ్చటి ప్రజలు కుతూహల పడుతున్నారు. స్టాలినాబాద్ దినపత్రికలు 1,10,000 కాపీల నమ్ముచున్నవి. రైతు పత్రిక 12,000 కాపీలనూ, యువకుల కుపయోగపడువార, పత్ర. మాస పత్రికలు 8,000 కాపీలనూ అమ్ముచున్నవి.

ముఖ్యపట్టణం పేరు స్టాలినాబాద్. ఇంకా ప్రారంభ దశలోవున్న పట్టణమైనప్పటికీ యంత్రశాలలతో నిండివుంది. ఈ పట్టణ నిర్మాణం 15 ఏండ్ల క్రితం

ప్రారంభింప బడ్డది. సదా మంచుతో కప్పబడ్డ ఎత్తైన కొండలమధ్య నున్నదీ పట్టణం. ఈ పట్టణానికి విద్యుచ్ఛక్తి, విమానాశ్రయం, బ్రాడ్ కాస్టింగ్ స్టేషను (ఆకాశవాణి కేంద్రం) కూడా ఉన్నాయి. పూర్వపు సందులు, గొందులు ఇప్పుడు లేవు. వీధులు వెడల్పుగా ఉన్నాయి. తారు, సిమెంటురోడ్లు ఏర్పడ్డాయి.

"వకష్ లోయ" పత్తి పంటకు పేరొందింది. ఈ ప్రాంతమంతటికీ నీటి సరఫరా కలిగింప బడ్డది. ఇచ్చట పొడవైన వెన్నుగల "ఈజిప్టు పత్తి" పండించబడుతూంది. ఈ ప్రాంతమంతటా సమిష్టి వ్యవసాయక్షేత్రా లేర్పడి పనిచేయుచున్నవి. పర్వత నివాసులు వ్యవసాయం చేస్తూన్నారు. శతాబ్దాలకు పూర్వం భూమివారినుండి బలవంతాన లాగుకొన బడింది. అంతట వారు పామీర్ పర్వతాలపైకి వెళ్ళారు. సోవియట్ ప్రభుత్వంవారిని మరల వారి తాతల, ముత్తాతల భూములకు తెచ్చింది.

పామీర్ పర్వతాలమీద సోవియట్ సరిహద్దులు ముగియుచున్నవి. పామీర్ పర్వతాలచుట్టి సోవియట్ సంయుక్తరాష్ట్రం, ఆఫ్గనిస్తాన్, చైనా, భారతదేశాల సరిహద్దులు కలుస్తున్నవి. పామీర్ పర్వతముల ఇరుకైన లోయలలో మధ్య ఆసియా ఆదిమ నివాసులు నేటికిని నివసిస్తున్నారు. వీరు మహమ్మదీయులు. ఆగాఖాన్ శాఖకు చెందినవారు. పూర్వం వీరు జీవితం పొడుగునా పస్తుండి, చెమటలూడ్చి ఆర్జించిన బంగారాన్ని, ఆఖరు గురిగింజ ఎత్తుకూడా, అగాఖాను కర్పించేవారు. ఇప్పుడు వీరికి కుడువను, కట్టను సమృద్ధిగా లభిస్తూంది. వీరి కష్టార్జితం ఇప్పుడు "మతగురువు"కు వెళ్ళడం లేదు. వీరే అనుభవిస్తున్నారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో వీరిప్పుడు పనిచేస్తున్నారు. ప్రపంచానికి ఇంటికప్పువంటిదైన పామీర్‌లమీద వీరు గోసుగడ్డలను, దుంపలను పండిస్తున్నారు.

మధ్య ఆసియాలోని విస్తారమైన ప్రాంతాలలోని సోవియట్ ప్రభుత్వం యొక్క సంగ్రహ చరిత్ర ఇది. అసమానమైన ధైర్యమూ, విశ్వాసమూ, నిశ్చలతతో సోవియట్ ప్రభుత్వం ఈ ప్రయత్నాన్ని సాధించి బీడువారిన ఈ ప్రపంచంలో (మధ్య ఆసియాలో) సహకార మానవ సమాజ స్థాపనకు పునాదుల నేర్పరచింది.

---

*Printed for the Cultural Book Club, Vangal Buildings, Perambur, Madras by Vinsian Press, 33, Jones Street, MADRAS. G. T.*

# మా ప్రచురణలు దొరకు చోట్లు

1. శ్రీ గాలి శ్రీనివాసరావుగారు, కోట
2. ఇసికెళ్ల ఆంజనేయులుగారు, ఒంగోలు
3. శ్రీ యస్. యన్. రాయిగారు, గాంధీచౌక్, తెనాలి
4. ది న్యూ వెరైటీ ఏజన్సీస్, గాంధీచౌక్, తెనాలి
5. ది వెరైటీ ఏజన్సీస్, గవర్నరుపేట, బెజవాడ
6. పీపిల్సు బుక్ డిపో, గవర్నరుపేట, ,,
7. సెంట్రల్ బుక్ షాప్, గవర్నరుపేట, ,,
8. మినర్వా బుక్ డిపో, మచిలీపట్నం
9. పీపిల్సు బుక్ హౌస్, గుంటూరు
10. శ్రీ మాడభూషి శేషాచార్యులుగారు, బ్రాడీపేట, గుంటూరు
11. భారతీ సదనం, ఖమ్మంమెట్టు
12. శ్రీ కొండా వీరయ్యగారు, మహంకాళివీధి, సికందరాబాదు
13. మాడరన్ బుక్ డిపో, సుల్తాన్ బజారు, హైదరాబాదు (దక్కన్)
14. ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజారు, హైదరాబాదు (దక్కన్)
15. శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు, విజ్ఞాన కళాశాల, నిడదవోలు
16. ఈశ్వర బుక్ డిపో, రాజమహేంద్రవరం
17. శ్రీ సకలా కిష్టప్పగారు, మదనపల్లి

వెంకట్రామా అండుకో వారి శాఖలన్నిటిలోను, హిగిన్‌బాథమ్సు వారి రైల్వే పుస్తకశాల లన్నిటిలోను మా ప్రచురణలు దొరకును

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | PSC01E406 | Date | 23/11/2022 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | NO | | |
| Missing Pages | NO | | |
| Prepared By | yameema | Cutting By | K.yameema |
| Scanned By | Sruthi | Pages | 73 |